సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

సంపుటము 45
సంచిక 21
14-1-53

Founder : K. NAGESWARA RAO

నందన పుష్య బహుళ చతుర్దశి బుధవారము



భోగిమంటలు, భోగిమంటలు ! వాడ వాడల, వీథివీథుల,

# ★ పాఠకులకు మనవి ★

ముఖచిత్రం: 'సంక్రాంతి గొబ్బెళ్లు'
చిత్రకారుడు: శ్రీ దశిక రామ లింగేశ్వరరావు.



## గమనిక

స్థలాభావం వల్ల ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రిక సంక్రాంతి సంచిక (14-1-1953 సంచిక) లో విజ్ఞాన వీధులు, జంతుకోటిలో మానవలక్షణాలు, ప్రశ్నలు - సమాధానాలు అను శీర్షికలు ప్రచురించ బడలేదు. తిరిగి 28-1-1953 సంచిక నుండి ఈ శీర్షికలు యథా ప్రకారం ప్రచురించబడగలవు.—సం.

## గోడమీద బొమ్మ

శ్రీ బలివాడ కాంతరావు గారి చిన్న నవల "గోడమీద బొమ్మ" ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రికలో 28-1-1953 సంచికలో సీరియల్‌గా ప్రారంభ మవుతుంది.

సంక్రాంతి ప్రత్యేక సంచిక ప్రచురణ సందర్భంలో ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక నడిపిన కథానికల పోటీలో పాల్గొన్న వందలాది రచయితలకు, సదా మా కృషికి తోడ్పడుతూ మమ్మల్ని ప్రోత్సహించే మా పాఠకులకు కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నాము.

సంక్రాంతికి తెనుగు దేశంలోని పల్లెపట్టుల తెనుగువారి జీవన రాగాన్ని చిత్రించాలనే కుతూహలంతో మేము తలపెట్టిన కార్యక్రమంలో రచయితలనేకమంది ఉత్సాహంతో పాల్గొని మా ఆశయ సాఫల్యానికి తోడ్పడినారని తెలుపుటకు గర్విస్తున్నాము. నిత్యము పచ్చందనాలతో కలకలలాడే తెనుగు గడ్డపైనా, నవనీత సదృశమైన పల్లెవాసుల అమాయిక జీవనం పట్లనూ కథకుల ప్రేమ ఇంతింతనరానిదని తెల్లమయింది. ప్రజల జీవితానికి సంబంధంలేని ఏవో తెలిసీ తెలియని ఆధునిక మనస్తత్వ శాస్త్రాంశములు, సాంఘిక విజ్ఞానసమస్యల తర్కవితర్కాలు కథానికల పేరున

**మొదటి బహుమతి (75-రు) పొందిన కథానిక "మేడమీద మర్రి" రచయిత శ్రీ విప్పర్ల వీర్రాజు గారు, మద్రాసు.**

**రెండవ బహుమతి (రు50-) పొందిన కథానిక "కర్రా చెప్పులు": రచయిత శ్రీ నార్ల చిరంజీవి గారు, విజయవాడ.**

చలామణి అవుతున్న ఈరోజులలో, తిరిగి రసస్ఫోరకమైన రచనా శిల్పాన్ని పెంపొందించవలెనంటే రచయితలు తమ దృష్టిని గ్రామాలకు మళ్లించడం అవసరమని మాకు వచ్చిన రచనలనుబట్టి ధృవపడుతున్నది. పోటీని గ్రామ జీవనానికి సంబంధించిన కథానికలకే పరిమితం చెయ్యడంలో

(64-వ పేజీ చూడండి.)

## వారపత్రికకు సెలవు

సంక్రాంతి పండుగ రోజులు ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక కార్యాలయానికి సెలవైనందువల్ల వచ్చేవారం పత్రిక ప్రచురించబడదని పాఠకులు గుర్తించ ప్రార్థన. సంక్రాంతి సంచిక అనంతరం 28-1-1953 తేదీ సంచిక యథా ప్రకారం ప్రచురించబడుతుంది.

—సంపాదకుడు.

# జీవనవంశి



శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

దాంభికముల్ జరామరణ తత్త్వము లీరజనీ నితంబనీ
లాంబర నిర్మలాంచలములందున నుండి చలించి ముంచి ము
త్యంబొకటేని జారిపడెనా! నవయౌవన విశ్వపూర్ణ పా
త్రంబున పొంగియున్న అమృతంబొక బిందువు బీఱువోయెనా!

ఏ నన కన్నె పూచునపుడేనియు నింకొక క్రొత్త పాటనే
గానమొనర్చి క్రొత్త నవకమ్ముల క్రొత్త పరిమళమ్ము క్రొం
దేనియనే యొసంగి ఎలదేటి కవుంగిలిలోన నవ్య సౌ
ఖ్యానుభవమ్ము నొందునపుడా జరయేదిర! మృత్యువేదిరా!

ఋతువుల పూల పళ్ళెరము లెప్పటిమాదిరి నిండుచున్న వ
ద్భుతముగ నెన్నొ నాకనులముందర నా నలువైపులందునన్
ప్రతి సుమమందు ప్రత్యగమునన్ నవయౌవన దివ్య దీప్తులే
అతిశయితమ్ములై శత శతాబ్ద సమృద్ధుల నుద్ధరించెడున్

ఆశలు రేపి జీవన రహస్యము లూదెడు నీ జలస్థలా
కాశములందు ప్రాగ్వనికాంతర సీమల వేణుగాన సం
దేశమదో వినంబడగనే వెస నా హృది వీణ మేళనా
వేశముతో సుదూరవనవీధులలోన ప్రతిధ్వనించెడిన్

ఒకతానమై నేను సకల ప్రపంచమ్ము
నిండింతు, నాదు సంగీతరవళి!
స్వాతిబిందువునయి వర్షింతు దేశమం
దంతట మంచి ముత్యాలవాన!

అణువులో పరిపూర్ణ యౌవనమ్మును నింపి
మెఱపింతు విశ్వసుందరమహస్సు!

రెండు పెదవులందు నిండిన నా నవ్వు
ఇహపరమ్ములను ముంచెత్త గలుగు!

కడల—ఏ మూలమూలల నెక్కడనో కాని
తనరుచుండును—ఒక్క బృందావనమ్ము
ఉదయమే కల్వరేకుపై నొదిగియున్న
శిశిరబిందువే మధురరససింధువగును!





# కాలక్షేపం



"రాధా పునాతు
జగదచ్యుత దత్తచిత్తా
మంథాన మాకలయతీ
దధి రిక్త పాత్రే
తస్యాః స్తన స్తబక
చంచల లోల దృష్టి
ర్దేవోపి దోహనధియా
వృషభం నిరుంధన్."

టీ॥ అచ్యుతదత్తచిత్తా = అచ్యుతునకు (కృష్ణునకు) సమర్పింపబడిన మనస్సు గలదై ; దధిరిక్తపాత్రే = పెరుగు లేని బానయందు ; మంథానం = కవ్వమును ; ఆకలయతి = త్రిప్పుచున్న ; రాధా = రాధ; జగత్ = లోకమును ; పునాతు = పావనము చేయుగాక !

తస్యాః = ఆరాధయొక్క; స్తన స్తబక చంచల లోల దృష్టిః = పూలగుత్తులవంటి పాలిండ్లయందు చంచలమై ఆడుచున్న చూపుగలవాడై ; వృషభం = ఎద్దును ; దోహనధియా = పాలు పిండవలెనను తలంపుతో ; నిరుంధన్ = బంధము వేసి కట్టుచున్న ; దేవోపి = దేవుడైన కృష్ణుడు కూడా ; జగత్ = లోకమును; పునాతు = పవిత్రము చేయుగాక.

తా॥ కృష్ణునియందే తన మనస్సును లీనము చేసినటువంటి రాధ పెరుగు లేనటువంటి బానలో కవ్వమును పెట్టి మథించుచున్నది.

ఆమెయొక్క పూగుత్తులవంటి స్తనముల మీదనే తనదృష్టిని నిలిపినటువంటి శ్రీకృష్ణుడు ఆ పరధ్యానముతో పాలు పితుకుటకై ఎద్దునకు కాలిబందమును కట్టుచున్నాడు. అట్టిరాధయున్నూ, అట్టి శ్రీకృష్ణదేవుడుకూడా లోకమును పవిత్రము చేయుదురుగాక !

రాధ మథించుచున్న బానలో పెరుగు లేక పోవుగాక. ఆ పెరుగులేని బానలో ఆమె కృష్ణార్పితమైన మనస్సుతో మథించుచున్నదనే భావం నవనీతం లాగున భక్తుడైన కవియొక్క హృదయంలోనుంచి ఉద్భవించింది. దధిరిక్త పాత్ర మధనమందు లభించిన భక్తినవనీతం ఇది. అంతకన్నా ఎక్కువైన మైమరపు మరొకటి చల్లచేసి జీవించే గొల్లభామ జీవితంలో ఏకవి తల్లజాడున్నూ కర్ణామృతంగా వర్ణించి చెప్పలేదు. రాధ చేసిన అపరాధంకంటె పెద్ద అపరాధమే కృష్ణుడు చేశాడు. ఎద్దును పాలు పితుకవలెనని యెంచి దాని కాలికి బందము బిగించి కట్టుచున్నాడు. కారణమేమిటంటే, రాధయొక్క కుచసౌందర్యం చూచి, పొదుగులేని పోతుకు పాలు పితుకుటకై యత్నించుచున్నాడు. రాధాపయోధరాయత్తచిత్తుడైన వ్రిగొల్లని వలపుచూచి —— ఆ ఎద్దు ఏమనుకున్నదో? ఆ రాధాకృష్ణుల ప్రేమ రహస్యాలు, ప్రేమ ప్రభావాలు, ఆ మధురానగరిలో చల్లలమ్మిన గొల్లవనితలకు తెలిసిఉండాలి. వ్రేపల్లెవాడలోని అబాలగోపాలమునకు తెలిసి ఉండవచ్చు.

హస్తినాపురానికి శ్రీకృష్ణుడు వస్తూ పోతూ ఉండేవాడు. ఈ హస్తినాపురం అనేది పూర్వము ఎక్కడ ఉండేనో యిప్పుడు భూగర్భపరిశోధనలు చేసి త్రవ్వి చూస్తున్నారు. ఢిల్లీకి కొంతదూరంలో హస్తినాపురం ఉండేది. మథురా అనబడే ప్రస్తుతపు పట్టణమే పూర్వం మధురానగరమై ఉండేది. గుజరాతు రాష్ట్రంలో కథియవాడలో ద్వారకానగరం ఉండేది. అది అరేబియా సముద్రతీరము. మధురానగరం యమునానదీ తీరం. ఇక్కడనే బృందావన్ కూడా ఉంది. ఈవిధంగా శ్రీకృష్ణులవారి జీవితచరిత్ర విశేషములలో విశేషభాగం వ్రేపల్లెవాడలో గొల్లభామల మధ్య నడచినట్లుగా కన్పిస్తుంది. పల్లెటూరి సరదాలన్నీ పూర్తిగా అనుభవించినవాడు – చిన్నప్పటినుంచీ రాజభోగాలలో, రాజమందిరాలలో, రాజమర్యాదలతో పెరిగినవాడు కాడు. పల్లెటూరి ప్రజా సామాన్యంతో పామరజనంతో కలిసిమెలసి వారి కష్టసుఖాలన్నీ కావడికుండలులాగున తాను భరించి, వారిని తరింపజేసిన మహానుభావుణ్ని వారు దేవునిగా పూజచేశారంటే అందులో వింతలేదు. రాళ్లవర్షం కురిసింది అంటే, ఊళ్లో ఉన్న ఆలమందలకూ, ఆలుబిడ్డలకూ అపాయం లేకుండా గోవర్ధనగిరి ఎత్తి అక్కడ వారికి శరణ్యం ఏర్పరచినాడు. కాళింగి మడుగులో పెద్ద సర్పం ఉన్నదనిన్నీ ఆ మడుగులోకి నీరు త్రాగుటకై వెళ్లిన పశువులన్నీ చచ్చిపోవుచున్నవనిన్నీ గొల్లలందరూ గోలపెట్టితే, ఆ సర్పముయొక్క దర్పమును అంత మొందించినాడు. ఆవులమందలను యమునానదీ తీరమువద్ద చక్కగా మేపుకొని ఆ పశువుల మందలను వృద్ధిచేసికొని మీరు వృద్ధిలోకి రండి అని ఆ పల్లెవాసులకు బోధించాడు. నోటిమాటలుగా రేడియో ఉపన్యాసం చెప్పి, గ్రామోద్ధరణార్థమైన ఒక ప్రణాళిక తయారుచేయించి, ఆ గ్రామాలలో దానిని ప్రకటించి, వెళ్ళిపోలేదు. తానుకూడా స్వయముగా ఆ గొల్లపిల్లలతో కలిసి యమునానది ఒడ్డున పశువులను మేపి, తన పిల్లనగ్రోవి పాటతో ఆ ప్రజా హృదయాన్ని చిగిరింపజేసి, గ్రామజీవితాని కొక కొత్త ఊపిరిపోసి, ప్రాణప్రతిష్ఠ చేశాడు.

ఈ కాలంలో ఉన్న విధంగానే, ఆ కాలంలోకూడా గ్రామవాసం చేసేవారికీ, నగరవాసం చేసేవారికీ లంగరు అందేది కాదు. నాగరికత అంటే నగరవాసుల లోనే ఉన్నదనిన్నీ, పల్లెలలోనివాళ్లకు బస్తీ పసందు తెలియదనియు, ఒక లోకాభిప్రాయం ఏకాభిప్రాయంగా ఉంది. పల్లెకు, బస్తీకి నాటికీ నేటికీ ఒక్కటే శాశ్వతమైన వ్యత్యాసం స్థిరంగా శిలాక్షరంగా కన్పి

స్తోంది. రాధాకృష్ణుల ప్రేమాతిశయ రూపంలో యీ విషయం లోకవిదితం అవుతోంది.

కృష్ణునకు రాధ మేనత్తవరుస అవుతుందిట. కృష్ణునకంటె వయస్సులో పెద్దదట. అదివరకే ఆమెకు వివాహం అయినదట. అట్టి ఆమెకు శ్రీకృష్ణునియందు అపారమైన ప్రేమాతిశయం కలిగినదట. ఆమెయొక్క ప్రేమానురాగ పరవశత్వమును చూచిన శ్రీకృష్ణుడు ఆమెపై తన మనస్సును మగ్నంచేసినాడు. ఆమె కృష్ణునియెదుట పాదాక్రాంతురాలయ్యేది. ఆ పురుషపుంగవుడు సాధారణ మానవుడు కాడనిన్నీ భగవదంశ కలవాడనిన్నీ ఆ గ్రామం మొత్తంమీద రాధ ఒక్కతే పూర్తిగా గ్రహించింది. యశోదకూడా అంత సంపూర్ణంగా కృష్ణుడు మహోత్కృష్టుడని గ్రహించలేదు. ఇదే రాధాకృష్ణుల ప్రణయగాథా రహస్యం. అయితే, యింకో విషయం ఉంది. "భగవదంశ" అంటే ఏమిటో, శ్రీకృష్ణునియందున్న ఆత్మజ్ఞాన సంపద ఏమిటో, మహాద్భుత యోగశక్తి ఎటువంటిదో రాధ వివరించి విస్తరించి గీతాభాష్యం లాగున విప్పిచెప్పలేదు. ఆ భగవత్తత్వ ప్రభావమును తాను తనివిదీర అనుభవించి ఆనంద పరవశత్వం పొందగలదు. అర్జునుని వలె భగవద్గీతను ఉపదేశంపొంది తద్వారా భగవత్తత్త్వమును ఆమె గ్రహించలేదు. ఆమెకు కావలసినది భగవత్తత్వాన్ని గూర్చిన జ్ఞానోపదేశం కాదు. ఆమెకు కావలసినది భగవంతుని సాన్నిధ్యం, సామీప్యం, సాలోక్యం, సారూప్యం, సాయుజ్యం - అంతే;

హస్తినాపురంలో ఉండేవాళ్లు శ్రీకృష్ణుని రాజకీయతంత్రప్రజ్ఞను, లౌక్య వ్యవహార చాతుర్యమును మెచ్చుకున్నారు. వ్రేపల్లెవాడలోని పల్లెవాసులు చూపినటువంటి భక్తి తాత్పర్యాలకూ, హస్తినాపురంలోని హేమాహేమీలు ఆ మహామహునియందు చూపిన గౌరవమర్యాదలకూ పొత్తులేదు - పోలిక లేదు. సత్యం ఎక్కడున్నదా అని వెతికి చూచేవాడు కల్లకపట మెరుగని పల్లెకాపు. చాణక్యతంత్రానికీ, యుగంధర ప్రజ్ఞలకూ రాజనగరములు జన్మస్థానాలు - నగరాలు వాటికి నిలయాలు.

శాంతిని కోరేది, పల్లెవాసాలలోని ప్రజా సామాన్యం - యుద్ధాలకు సిద్ధమై కోటలు కట్టేది మహానగరములలో - వీరి జీవితం

లోనిది రాజసలక్షణం. వారిది సాత్విక లక్షణం. గ్రామజీవనము సాధుజీవనము. నగరవాస జీవనము,

# కాలక్షేపం

యోధజీవనము - గ్రామవాసం స్త్రీవంటిది. పట్టణవాసం పురుషునివంటిది - అది రాధ. ఇది కృష్ణుడు.

అయితే, కాలం తారుమారవుతోంది. పల్లెటూరి పద్ధతులు పల్లెటూరి పద్ధతులుగా ఉండడంలేదు. బస్తీగాలి తగిలి పల్లెటూరి పిల్లకూడ మల్లెకంటె మొల్లకంటె తెల్ల వారకముందె చెల్లని ఏగానిలాగున వాడి పోతోంది. పల్లెటూరు అంటే పాటుపడిన వారికి అది పరమపదం. కాలుమీద కాలు వేసి కొన్నవారికి నోటిలో మన్ను వేసికో వాలి. లేదా మందు వేసుకోవాలి. భూవసతి సమృద్ధిగా ఉన్న సంపన్న సంసారికూడా కాయకష్టం చేస్తేనే శరీరంలో హాయిగా ఉంటుంది. కమ్మని పెరుగుఅన్నం తినలేని వాడు, "కాడ్లివరు ఆయిల్" సీసా తెచ్చు కొని త్రాగవలసి వస్తోంది. పెరటిలోని బచ్చలి జీర్ణంకాక పెన్సిలిను యింజక్షన్లు పుచ్చుకుంటున్నారు.

గ్రామం వీలైనంతవరకు గ్రామంగానే ఉండాలి - స్త్రీ వీలైనంతవరకు స్త్రీగానే ఉండాలి. ఆ స్త్రీతత్వాన్ని పురుషతత్వ సమీప సాన్నిధ్యంలో ఉంచవలెనే గాని ఆ స్త్రీతత్వం పురుషతత్వంలోకి మారకూడదు. అలా మార్పు చెందడం ముక్తిమార్గం కాదు.

అల్లుడు అంటే నిజంగా శ్రీకృష్ణపరమాత్మ్మడే. హస్తినాపురంనుంచి వ్రేపల్లెకు వచ్చేవాడు. "వస్తాడే మాబావ! వస్తాడే! రేపోమాపో వస్తాడే! ఢిల్లీనుంచి వస్తాడే!" అనే ఆతురత ఆనాడు వ్రేపల్లెలోకూడా ఉండేది. ఈనాడు ఏ పల్లెలోనైనా ఉంది.

సంక్రాంతి పండుగకు అల్లుణ్ని మర్యాద చేయడమే అసలైన సంక్రాంతి పురుష పూజ అని చెప్పినా తప్పులేదు. భార్య పుట్టింటిలోనే ఉంటున్న దైనట్లయితే, ఆ భార్యవద్దకు,మకరధ్వజుడైన మన్మథునిచేత ఆకర్షింపబడినవాడైన అల్లుడు"రాజా వెడలె రవి తేజము లలరగ" అన్నట్లుగా బయలుదేరి అత్తవారింటికి సంక్రాంతి పండుగనాటికి చేరిన యెడల, మకర రాశిలో సూర్యుడు ప్రవేశించినట్లె భావించవచ్చు. అటువంటి సంక్రమణ పురుషుణ్ని సకల మర్యాదలు చేసి పంపించడం, తృప్తిపరిపించడం ఉత్తమమని, ఉత్తరాది వాండ్లు, యీ ఉత్తరాయణ పుణ్యకాల ప్రవేశసందర్భంలో భావిస్తారు. ఆ పుణ్యకాలానికి పూర్వమే పురుడుపోసికొన్న పుణ్యాంగనలుకూడా పుట్టినిండ్లలో,పట్టపు



"ఏనుగంబారి" —కొండపల్లి బొమ్మ.

వాసం లెక్క చేయని పట్టపు రాణులవలె, సర్వస్వామ్య సంకలిత నవలా రత్నముల వలె, నవ ప్రసవ శోభతో, బహుదూర ప్రయాణం చేసివచ్చిన భర్తకు స్వాగత మిచ్చి, గుమ్మడి పండువంటిబిడ్డను చేతి కిచ్చి, ఫలప్రదానం చేస్తారు. సూర్యునకు యిష్టమైన పండు గుమ్మడిపండు అంటారు. గుమ్మడిలో సూర్యగుమ్మడి అనే ఒక ప్రత్యేక రకంకూడా ఉంది. ఇతర లంక గుమ్మడికంటె ఇది చిన్నది. కాని దీనికి ఉన్నంత తీపి యితరరకముల గుమ్మడికి లేదు.

అల్లుడు యింటికి వచ్చాడంటే, "యిదిగో మా పెరటిలో పెరిగిన గుమ్మడి పాదుకు కాచిన గుమ్మడిపండు" అని యీ సంక్రాంతికి సంబరముగా చూపింప గల్గిన అత్తగారుగాని, ఆడపడుచుగాని, యీ రోజున పల్లెగ్రామాలలో ఉంటే, నేత్ర పర్వంగా ఉంటుంది. అవిధంగా కాయగూరలకు కరువులేకుండా కాపించడం మెట్టఊళ్ళలోని రైతుల గట్టి పట్టు. కాని, వరిపంట విరివిగా విస్తరించిన పల్లపు మాగాణి భూములలో ఢిల్లీ భోగాలు పండించుచున్నటువంటి వారికి యీ మెట్టకృషి అంతా వట్టి మెట్టవేదాంతంగా మారిపోయింది. కొన్ని పల్లెగ్రామాలలో పశువులకు మేత మేయుటకు కాలువ గట్లు తప్ప యితర గోభూమి ఏమినీ కన్పించదు. గోవులకు విందులేనిచోట గోవిందు డుండడు. పశువుల మందలకు పచ్చిగడ్డికూడా లేకపోతే, మన పంచవర్ష ప్రణాళిక అంతా "గోవిందా!" అనవల

సిందే. దధిలేని భాండంలో కవ్వంపెట్టి చిలికితే ఏమీరాదు. వెన్న సున్న అయితే, అన్నంలోకి డాల్డా. ఇదే ఇప్పుడు బస్తీ జీవిత నవనీతం. వైట్ మాన్ (తెల్లదొరలు) నేర్పిన వైటామినులు ఇందులో లేవు. నిస్తేజమైన, నిర్గంధమైన, నిర్వీర్యమైన పదార్థం ఇది. డాల్డా జాతికూడా అంతే. హాయిగా పల్లెటూరికైనా వెళ్లి కమ్మని వెన్న కాచిన నెయ్యి వేసికొని కడుపునిండా అన్నం తిందామా అంటే, అక్కడకూడా అల్లునికోసం చేసిన అన్ని రకాల పిండి వంటలను డాల్డాతోనే అత్తగారు ఆయత్తం చేసి ఉంచితే, "మీ కెన్ని పాడిపశువులు" అని బావమరదిని సావధానంగా అడుగ నక్కరలేదు. పెరటిలోని ఎద్దును తెచ్చి, "ఎన్ని పాలిస్తుంది ఇది?" అని ఎగతాళికి అడిగినా, ఏమీ అనడు బావమరది.

సంక్రాంతిపండుగ రాకపూర్వమే చక్కగా నీళ్లుపోసి పెరటిలో పెంచిన బంతిపూలచెట్లు చెంతనున్న చెలికత్తెలు లాగున విచ్చిన పూలను ముచ్చటగా అందిస్తాయి. ఈ సంక్రాంతి పర్వదినమున యిది ఒక నేత్రపర్వము - కాని, రంగు రంగుల ఊలు ఉండలు పట్టణమునుంచి తెప్పించి చక్కని పూల చెండ్లవలె కట్టి అల్లుడు యింటికి వచ్చేసరికి కంటికింపుగా తెచ్చియిచ్చింది ఒక యిల్లాలు. ఇచ్చే ముందు తన చాతుర్యం ప్రకటించుటకుగాను, "పూలబంతి కావాలా? బంతి పూలు కావాలా?" అని అడిగింది. ఆఖరుకు చేతికిచ్చింది, బంతిపూలకు బదులుగా ఊలు పూలుతో కట్టిన పూలబంతి - దానికి 8 రూపాయలు ఖర్చయింది. కాని బంతి పూలవాసన దానికి లేదు. గడప గడపకూ బంతిపూల దండలు తగిలిస్తే ఆదండలవల్ల యింత దండుగ లేదు. భర్త కోరింది బస్తీ షోకు కాదు - దానిలో ఉన్న చేదును శ్రీకంఠుని రీతిగా అతడు తన ఉద్యోగశ్రీకొరకై మ్రింగి అనేక భంగుల క్రుంగి అనుభవిస్తున్నాడు. తన యిల్లాలు పురిటినీళ్లు పోసికొన్నది లగాయతుబిడ్డకు తల్లిపాలు లేవని తల్లి తల్లడిల్లి పోతోంది. ఎందుచేత యీపాలు లేనిబిడ్డలు ఆమెపాలిట పడాలి? కాయ కష్టంచేసి పాటుపడే పాటక జనం యీ అవస్థలపాలు కారెందుచేత? కుమారుడుకలిగిన ఈ సుకుమారికి దుగ్ధంలేని దుర్గతి తప్పదు. క్షీరోత్పత్తికి కావలసిన దినుసుల చూర్ణం ప్రసవించిన యిల్లాలు ప్రసాదంలాగున స్వీకరించాలి. కాని, ఇంగ్లీషు వైద్యంలో ఇవన్నీ సేవించడమూ లేదు; తల్లికి పాలు స్రవించడమూ లేదు. భార్య పాలు యివ్వలేకపోతే, ఇక భర్త పాలు యివ్వాలి. అందుకని,

భార్యను పిల్చి చమత్కారంగా అన్నాడు. "పట్నం నుంచి నీకు పనికివచ్చేది తెచ్చాను. బుడ్డిపాలు కావాలా? పాలబుడ్డీ కావాలా?" అన్నాడు. రెండూ కావాలంది. అప్పుడు గాజుపాలబుడ్డీ ఒకటిన్నీ, పాలపొడి ఉన్న బుడ్డి ఒకటిన్నీ పెట్టెలోనుంచి తీసి యిచ్చాడు. బిడ్డ కిది దొడ్డకానుకగా స్వీకరించింది. ఇదే ఉత్తమ క్షీరమని తిత్తి తగిలించి త్రాగిస్తోంది. ఈ ఉత్తమ క్షీరపు ఉత్తరగతి చాలా ఉంది. దానివల్ల పిల్లవానికొక బల్ల - ఆ బల్లవల్ల యిల్లూ ఒళ్లూ గుల్ల. బల్ల కట్టిన ప్రతి డాక్టరుమీద మోజుపడి ఫీజు చెల్లించినా, పిల్లవానిబల్ల గుడ్డిలో మెల్లగా ఉంది గాని, బిడ్డ ఒళ్లు చెయ్యలేదు. కనీసం *Milk Depots* లో కొన్నటువంటి వెన్న తీసిన పచ్చిపాలు అయినా కొని తెచ్చిపోయడం మంచిదని భార్యతో వాదించాడు. 'మిల్క్-డిపోస్' అంటే 'పాలు అమ్మే యిండ్లు' గనుక, అవి కూడా పాలిండ్ల తాలూకు పాలుగానే పరిగణించవచ్చునని వాదించాడు. కాని, ఈ శ్లేష ఆవిడ గ్రహించలేదు. పిల్లవానికిమాత్రం అప్పుడప్పుడు శ్లేష్మప్రకోపం కలిగింది. ఈ విధంగా గ్రామజీవితంకూడా దధిరిక్తభాండ మథనంగా పరిణమించినట్లయితే గ్రామాల అభివృద్ధి విషయంలో మనం చాలా అశ్రద్ధగా పరధ్యానంగా ఉంటున్నామని గ్రహించాలి.

దొడ్డిలో కొబ్బరిచెట్లు పెంచినవాళ్ళు ఒక కొబ్బరి బొండంకోసి అల్లునకు ఆరగించమని యివ్వడం దివ్యంగా ఉంటుంది. కాని ఆ కొబ్బరినీళ్ళు తాగితే శిరోభారం చేస్తుందనే పక్షంలో, కాఫీకప్పులు ఎన్ని యిచ్చినా సాఫీగా వుంటుంది ఏ బద్ధకం లేకుండా. కొబ్బరిచెట్లను దొడ్లో పెంచితే అమ్మాయికి బొట్టుపెట్టి బొండంయిచ్చి రవికలగుడ్డ యిచ్చి భర్తతో పంపిస్తే కనుముదాటినా ముక్కనుము దాటినా, కన్నుల పండువుగానే ఉంటుంది. కొబ్బరిచెట్టు పెంచినా అది ఎక్కలేనివారికి అది అందజాలని మ్రాని పండు. కాయకష్టంచేయనివారికి గ్రామ జీవిత సౌఖ్యం కూడా నారికేళపాకంలోనే ఉంటుంది. కొబ్బరిచెట్టు ఎందుకు ఎక్కినావని ప్రశ్నిస్తే, దూడగడ్డికోసం ఎక్కానని ఒక్కడొకప్పుడన్నాడు. కాని, గ్రామంలోఉండి కాయకష్టంచేయక కాయగూరలైనా పెంచక ఒళ్ళు వంచకపోతే, తన పంట తాను తినుటకంటె, తన గడ్డితాను తినవలసివస్తుంది. అటువంటి వారికి గ్రామ జీవితంలో ఉన్న రాధామాధవ గాథామృతం బోధపడదు.

# మకర సంక్రాంతి

## కీ. శే. కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు

[భా॥ సంక్రాంతి 1874]

వాపీతటాక హ్రదావగాఢస్నాన
పావన ద్విజకుల భాసితంబు
కూష్మాండముఖదానగురుతర్పణాదిక
తర్పితామర పితృ దైవతంబు
వివిధాన్న భక్ష్య సద్విపుల భోజనమత్త
సకల జనానీక సంకులంబు
వివృత త్రివిష్టప విభవ సంసూచక
సుమలంకృతాఖిల జనపదంబు
హరి హరోత్సవ దర్శన వ్యగ్రమనుజ
మానస ధనాపహర్తృకామినీయ
మానసానాప్సరోంగ నాయమానితంబు
రమ్య రమ్యంబు మకరసంక్రమ దినంబు.

[సేకరణ: శ్రీ నిడుదవోలు వేంకటరావు]

పల్లెటూరివాళ్లు మిల్లుబట్ట కట్టడం వల్లనే పల్లె గుల్ల అయింది. "ఖద్దరు" అనే మాట గాంధిమహాత్ముడు మనకు నేర్పిన కొత్త మాట. కాని, మహాత్మునకు పూర్వమే మన గ్రామాలలో మన వస్త్రాలు మనము తయారుచేసికొన్నాము. మన గ్రామాలలో వడికిన నూలుతో మన గ్రామాలలోని మగ్గాలతో నేసిన ముతకబట్టలను మన వాళ్ళందరూ కట్టుకొనేవారు. వీటినే పొటినూలు బట్టలనేవారు. పొటినూలు బట్టలనే కట్టుకున్నారు భారతం రచించిన నన్నయభట్టుగారు. పొటినూలుబట్టలనే కట్టుకున్నారు బమ్మెర పోతన్నగారు—"వారికంటెను మీ మహత్త్వంబు ఘనమె?" అని సన్ననూలు మిల్లుబట్టలు ధరించిన నేటి కవి తిల్లజాలను ప్రశ్నించవచ్చు. శరీరదార్ఢ్యం విషయంలో మాత్రము మనం సన్ననూలు వడుకుతున్నామని చెప్పవచ్చు. ఏమైనప్పటికీ ఆనాటి "అల్లిక జిగిబిగి", ఆనాటి "మన్నుదల" ఈనాటి మిల్లుగుడ్డకూ లేదు; ఈనాటి పిల్లకవుల సరిగంచువల్లెలు, వోణీలు, కండువాలవంటి ఖండకావ్యములకూ లేదు. పల్లె గ్రామంలో పొటినూలుబట్ట పోతేపో యుంది. కమ్మని దంపుడు బియ్యమైనా తిని, కమ్మని వెన్నగాచిన నెయ్యితో కడుపార ఆరగించవలెననే ఆశతో బస్తీ అల్లుడు యీ పండుగకైనా పల్లెటూరుకు వచ్చి అత్తవారింట అతిథిగా ఉంటాడు. అల్లుడు రాగానే వడ్లు దంపుటకు కావలసిన కొందరు ఆరితేరిన ఆడవాళ్ళను పిలిపించి ఒక బస్తా వడ్లు అదనంగా ఆరబోసి దంపుళ్ళసావడిలో ప్రత్యేకంగా దంపిస్తూ ఉంటే, బావమరదితోసహా అల్లుడు వెళ్ళి ఆ వడ్లదంపుడు కొత్తగానా సందర్శించాడు. వడ్లు దంచడం కూడా బస్తీ అల్లుని కొక వినోదకరమైన వినూత్న విలాస కాలక్షేపంగా ఉంది. బావగారు కవి. అందులో భావకవి. అసలే సంగీతప్రియుడు. అందులో నలుగురు నడివయస్సు ఆడవాళ్లు రోకళ్ళు చేతబట్టి ఒకరి రోకలి కింకొకరి రోకలి డీకొట్టుకోకుండా నలుగురు ఆడపడుచులు కుచ్చెళ్లు వెనుకకు బిగించి కట్టి లయబద్ధంగా దేశీయమైన తియ్యని కమ్మని తెలుగు పాటలు తేనెటీగలు ఝుంకారం చేసినట్లుగా పాడుతూ, నాలుగు కొళ్ళతో

(64-వ పేజీ చూడండి)



తాటి కట్టవలమధ్య బండిబాట సన్నగా ఉంది. అక్కడక్కడ తాటాకులు బండిగూటికి రాచుకుంటూ 'బర్ర్' మని శబ్దం చేస్తున్నయ్. కట్టవ వెలితిల్లోనుండి దూరంగా పాలెం కనబడుతోంది. పాలెం వెనుక ఆకాశం ఎర్రగా ఉంది. ఎడ్లు గంటలు గలగల్లాడించుకుంటూ ఎంత జోరుగా నడచినా మెల్లగానే నడచినట్లుంది, మెయిల్లో ప్రయాణం చేసివచ్చిన రామానికి.

"అదిగో ఆ కనపడే పెంకుటిల్లు చూశావా?" తొట్లో కూర్చున్న సుబ్బారావు కొరడాకర్ర తిరగేసి పాలెంవేపు చూపించాడు. పాలెం మొగదల చిన్న బంగళా కనబడుతోంది. "కామరాజు కట్టించిన ధాన్యం మిల్లు." సుబ్బారావు అన్నాడు. పూర్వం ధాన్యం ఆడించుకోడానికి ఏడుమైళ్ళదూరం పోవలసివచ్చేది. పాలెంకూడ పెద్దదవుతుందన్నమాట.

బండి మాలపల్లి దాటింతర్వాత మలుపు తిరిగింది. అప్పుడే ఆవరించే చీకట్లో తెల్లగా కనబడే మేడను చూపిస్తూ "అదే కామరాజు కట్టించిన మేడ." అన్నాడు సుబ్బారావు. కడుపు చేత్తో పట్టుకొని వచ్చిన కామరాజు ఎంతటివాడయ్యాడు!

"కామరాజుపని మాంచి జోరుగా ఉందిలే" ఎడ్లనదలిస్తూ అన్నాడు సుబ్బారావు. రామం మేడవంకే చూస్తున్నాడు. ఆమేడ వీధికే అందాన్నిచ్చింది.

బండి మళ్లీ మలుపుతిరుగుతూ గోడమూలనున్న రాయినెక్కి దబ్బునపడింది. రామం తల గోడకు కొట్టుకుంది. తల తడుముకొని, బద్ధకం విరుచుకుని ఎదరకు చూచాడు. తాటాకిళ్ళమధ్య ఎత్తరుగుల మండువాలోగిలి పర్వతంలా కనబడుతున్నది. అరుగుమీద అమ్మ, అత్తయ్య, కాంతం ఉండాలి. నాన్న కెన్ని పనులో! ఎక్కడుంటాడో.

బండి దిగి లోపలికెళ్ళేసరికి పెద్ద మండువాలో చిన్న లాంతరు మిణుకు మిణుకుమంటూ కనిపించింది. కొడుకుని దగ్గరగా చూస్తూ "బొత్తిగా అలా గయిపోయావేంరా!" అంది రత్తమ్మ. సుబ్బారావు ప్రక్కని బల్లమీద కూర్చున్నాడు. కాంతం గుమ్మంలో నించుంది. "మాడమ్మా! కాంతం. అన్నయ్యకి నీళ్లు తోడు. లెగు రామూ ఎప్పుడు తిన్నావో." అంది సుబ్బద్రమ్మ.

రామం పట్నంవెళ్ళి సంవత్సరమైంది. ఆరాత్రి అందరిదృష్టి రామంమీదే ఉంది. పట్నం విశేషాలు చెబుతున్నాడు రామం.

తన కొడుకు ఇంత పెద్దచదువు చదువుతున్నందుకు రంగయ్యకెంతో సంతోషం. ఆ వూరికంతా పెద్ద చదువు చదివింది తనకొడుకే. "పరీక్షలయి పోయినియ్యా?" కొడుకు నడిగాడు. అంతకంటె ఎలా పలకరించాలో తెలియలేదు.

"ఊఁ!" అన్నాడు రామం.

"మళ్లీ ఎప్పుడెళ్లాలి?"

"మూడు నెలలవరకూ వెళ్ళక్కర్లేదు."

రంగయ్య కొడుకుతో ఎప్పుడూ ముక్తసరిగా మాట్లాడతాడు. రామం కూడ అంతే. రంగయ్య వాకిట్లో పడుకుని కొడుకు చెప్పేసంగతులన్నీ వినటంలేనట్టు నటిస్తూ, వింటున్నాడు.

మర్నాడుదయం రామం సుబ్బారావులు మండువాలో మంచం మీద కూర్చుని మాట్లాడుకుంటున్నారు "పెద్ద ఉజ్జోగం సంపాదించి మన ఊరికి కాలవ పడేట్టు చూడు." అన్నాడు సుబ్బారావు. ఇప్పుడు మద్రాసులో చదువుతున్నాడంటే ఎంత పెద్ద ఉద్యోగం చేయాలి!

సుబ్బారావు అన్నదానికి రామానికి నవ్వొచ్చింది. అప్పుడు ఇంకా రామపాద సాగర్ ప్రాజెక్టు ఇన్వెస్టిగేట్ చేస్తుంటేనే, అది పూర్తయినట్లు, రేపో మాపో కాలవొస్తున్నట్లు చేలధరలు ఆకాశాన్నంటే

కాయ్. ఒక సంవత్సరానికి ధరలు మళ్లీ మామూలుగా తగ్గిపోయినా, కౌలవ వస్తుందన్న నమ్మకం మాత్రం పోలేదు కొందరికి. సుబ్బారావుకూడ అంతే. ఎంత అమాయకత్వం! బయటి సంగతులు ఏం తెలియవు వాడికి. ఒకప్పుడు తనకంటె వాడే తెలివైనవాడు. వీధిబడిలో చదివేటప్పుడు చింతపిక్క మాస్టారు వాణ్ణే పొగిడేవాడెప్పుడూ. తనకి ఒక్క లెక్కకూడ వచ్చేది కాదు. ఇద్దరూ కలిసి వెళ్ళడంవలనా, వాణ్ణి పొగడ్డంవలనా తను తప్పనిసరిగా తిట్లు తినవలసివచ్చేది. నాలుగో క్లాసు అయింతర్వాత నాన్న యిద్దర్నీ జగ్గంపేట పంపుతానంటే అత్తయ్య “ డికి చదువెందుకన్నయ్యా. ఆచేను కొంతా ఎవరు చూసుకుంటారు?” అంది. దాంతో వాడి చదువాగిపోయింది.

సుబ్బారావు వ్యవసాయంలో ప్రవేశించిన మొదట్లో రంగయ్య “నాకు సాయంగా ఉంటాడు” అనుకున్నాడు. కాని వాడు వ్యవసాయంలో బాగా తీరాడు. ఇప్పుడు తనదీ మామయ్యదీ కలిపి చేయిస్తున్నాడు. రంగయ్య పైనుండి చూడ్డమే. సుబ్బారావు చెప్పిందే పని సేద్యంలో బాగా తెలుసు.

[illegible]

కాని పలానా అప్పుడు పలానా పని చేయిస్తాను అని రంగయ్యతో చెబుతాడు. రంగయ్య “ఊఁ!” అని మాత్రం అంటాడు. సుబ్బారావుని అల్లుడిగా చూసుకొని సంతోషించేవాడు.

రామం సుబ్బారావుల మాటలు తరగడం లేదు. లోపల రత్తమ్మ కొడుక్కి కాఫీ కాస్తున్నది. కాంతం సాయం చేస్తోంది. గాజు గ్లాసు, పంచదారడబ్బా పట్టుకొచ్చి పొయ్యిదగ్గర పెట్టింది. అమ్మ కాఫీ వడకడుతుంటే కాంతం అటు అత్తయ్యదగ్గర కెళ్లింది లేకపోతే అన్నయ్యకు కాఫీ పట్టుకెళ్ళాలి. సుబ్బారావు అక్కడే ఉన్నాడు.

సుభద్రమ్మ రంగయ్య చెల్లెలు. ఊళ్లోనే యిచ్చారు. సుబ్బారావు పుట్టిన మరుసటి సంవత్సరమే సుభద్రమ్మ భర్త పోయాడు.

రంగయ్యది మండువాలోగిలి. ఎడాకి లాగుంటుంది. చెల్లెల్ని తన యింటికి వచ్చేయమన్నాడు. సుభద్రమ్మ దూరం ఆలోచించి వంట మాత్రం వేరే పెట్టి అన్నగారింట్లోనే ఒకపక్క ఉంటూవచ్చింది, ఈ ఇరవై సంవత్సరాలనుండి. పైకి అంతా ఏక కుటుంబంలానే కనబడుతుంది.

కాంతం అటు అమ్మకూ, ఇటు అత్తయ్యకూ కూడ ఏదో పనిలో అడ్డం పడుతుంటుంది. ఇష్టం లేకపోతే ఎక్కడో కూర్చుని అత్తయ్యగారి వేపున్నానని అమ్మతోను, అమ్మదగ్గరున్నానని అత్తయ్యతోను చెబుతుంది. ఏమైనా అంటే ఘల్లున నవ్వుతుంది. కాంతాని కిప్పుడు పధ్నాలుగేళ్లు. అది లక్ష్మిలా ఇటూ అటూ తిరుగుతుంటేనే కడుపు నిండినట్లుంటుంది అమ్మకూ అత్తయ్యకూ.

రత్తమ్మ కాంతాన్ని పిలిచింది. గోడవతలనున్న కాంతానికది వినబడలేదు. ఉల్లిపాయలు వలుస్తున్న కాంతంతో ప్రక్కనే ఉన్న సుభద్రమ్మ “మాడెమ్మా అమ్మెందో పిలుస్తోంది.” అంది. “ఊఁ!” అని మూలిగి కాంతం అమ్మదగ్గరి కెళ్లకుండా ఇటు ఇంట్లోకి వెళ్లింది. సుబ్బారావు పరుపుమీద





"వాకిట్లో ముగ్గు"

—శ్రీ పి. యస్. ప్రకాశరావు, రాజమండ్రి.

# మేడమీద మల్లి

పెట్టిన బ్యాటరీలైటు తీసింది. అది వేరు శనగకాయల కాలంలో నక్కల్ని కాయడానికని మామయ్యకు తెలియకుండా రామం చేత మద్రాసునుండి తెప్పించుకున్నాడు. కాంతం పరుపుమీద బోర్లపడుకుని లైటు వేసి గోడమీదకు చూసింది. అమ్మ మళ్ళీ పిలిచింది. ఎందుకో తనకి బావదగ్గరి కెళ్ళడానికి చచ్చేటంత సిగ్గు. తనతో మాట్లాడుతూ బావని గురించి చెప్పవలసివస్తే అందరూ "నీ మొగుడు" అంటూ చెబుతారు. ఒళ్లు పులకరించి ఏదో లాగుంటుంది. బావ తనకు కనబడితే అదోకలా చూస్తాడు. తనలా చాటునుండి కూడ కాదు!

"కొంతయినా తాగలేదు." అంటూ రత్నమ్మ వచ్చి "ఇక్కడున్నావటే! ఇది తాగయ్." అంది రామం కనీసం చెంబుడు కాఫీ అయినా తాగలేదని ఇదవుతూ చెంబు అక్కడ పెట్టి వెళ్ళింది. కాంతం లేచి ఒళ్లు విరుచుకుని, పైట సర్దుకుని ఇంకొంచెం పంచదార కలిపి బాగా చల్లారిం తర్వాత రెండు గుక్కల్లో తాగేసి, అన్నం తినడానికని బయటికొచ్చింది.

సుబ్బారావు పొలం వెళ్లాడు. పని ఉన్నా లేకపోయినా, ప్రపంచం మునిగిపోతున్నా పొలం వెళ్ళడం మానడు. అది వ్యసనం వాడికి. రామం ఒక్కడూ అరుగుమీద కూర్చున్నాడు.

"ఇదేంటోయ్! నువ్వెప్పుడు దిగావ్!" సూర్యుడు పడమట ఉదయించినంత ఆశ్చర్యంగా అడిగాడు రాయుడు అరుగుమీదకొచ్చి.

"నిన్న సాయంత్రం." అన్నాడు రామం.

"ఉహూ!" తలపాగ గోడకు జేర్చి, దానికి జేరబడి "పట్నం ఇసేసాలేంటి ?" అన్నాడు రాయుడు. రాయుడు ఎంత పెద్ద రైతయినా చిన్న అంగవస్త్రం, తెల్లటి తలపాగా, చిన్న తుండుగుడ్డ తప్పితే మరోటి ధరించడు.

"ఏంఉన్నయ్ విశేషాలు ?"

"అయ్యో! బాగుంది! నాకు తెలిస్తే నిన్నడగటమెందుకూ? ఈయేడు పేసయ్యావా? పేలిపోయావా?......నవ్వుతాడేం!" గద్దించాడు.

"అబ్బే! ఇంకా తెలియవ్."

"ఇంతా చదివి ఏం ఉజ్జోగం చేత్తావో మరి. పెద్ద కలట్టరుజ్జోగం చెయ్యాలి. ఊ! ఊరుకు పేరు తేవాలి ఏవనుకుంటున్నావో మరి."

"బాబుగారెప్పుడొచ్చారూ ?" అప్పిగాడి గొంతుక వినబడిందో లేదో రాయుడు గబుక్కున వాడివేపుకు తిరిగి, "ఒరేయ్! మా బాగా వచ్చావ్. కరణం ఉన్నాడో లేదో చూసిరారా. అదేదో తేల్చుకోవాలి" అన్నాడు.

"ఏంటండి ?"

"అదేరా పూజారోరి మాన్నెంలో బెడ్డిరుస్తూ కొవరాజు గట్టు జరిపేసేడు కాదూ! అది! తల్లీ మొగుడు! ఎల్లా." అప్పిగాడు పోయింతర్వాత రామం వేపు తిరిగిఅన్నాడు. "ఈ మద్దిన కొవరాజుగాడు మదించిపోయి ఏడుత్తున్నాడులే. అణ్ణి ఆ సత్తియ్యగాణ్ణి నీటికాడ ఓ ఊపు ఊపాడు. సుబ్బన్న చేను పచేసుకుందా మనుకున్నాడు. నన్ను కూడ ...ఓసమ్మ! ఆడికంటే ఎత్తులు తెలుసు నాకు. నా కళ్ళుముందెదవ నాతోటే చెలగాటం ?"

రాయుడిమాటలు రామానికర్థంకాలేదు.

"సుబ్బన్న చేను పచేసుకోవడమేమిటి?"

అన్నాడు.

"ఆ! ఏంలేదు. ఈమధ్య నేదో అప్పు జేశాడు. చేను అడికి తణకా పెట్టాడు. దానికి డావా చేత్తానని కూకున్నాడు. ఉన్న పళాన్ని నాలుగే లెవరిదగ్గి రుంటయ్. మీనాన్నే యిచ్చి తనపేర రాయించు కున్నాడప్పుడు. తింటానికి లేకుండా వచ్చి ఊరిమీదే తిరగబడ్డాడు యెదవ. దుమ్ము తిరగబోడుత్తాను ఏవనుకుంట న్నాడో."

"ఎవరూ? కొవరాజుగాడేనా?" అప్పుడే వచ్చిన రంగయ్య అరుగుమీది స్తంభంమీద చేయివేసుకుని నిలబడి అడిగాడు.

"ఊఁ! ఆడిమాటే."

"ఆడిపని మా తిమ్మిరిగా ఉంది."

"ఊరుకుంటుంటే సరి. ఉండదూ?"

"నడుమంత్రం సిరి ఎలాగయితే అబ్బిందని తెగ మిడిసిపడుతున్నాడు ఊరుకుంటే లాబంలేదు."

"ఊరుకుంటానూ? ఈపాలికా పెదవకి జమత్తానా? ఆ గట్టుమీదే తెగేత్తాను." తలపాగ చేత్తోపట్టుకొని లేచి "పొద్దుకుంకేటప్పటికి జరిపించేయనూ!" అంటూ కొంచెం లావుగా ఉన్న నల్లటి శరీరాన్ని ఊపుకుంటూ పోయాడు రాయుడు.

రామాని కింటిదగ్గర తోచక కరణందగ్గరకెళ్ళి లైబ్రరీ తాళం పుచ్చుకుందామని లేచాడు. కరణం ఇల్లు ఆ వీధి చివర్నే. కరణం అరుగుమీద కూర్చుని సుబ్బన్నతో మాట్లాడుతున్నాడు.

"పిలిచి పిల్లనిస్తానంటే కులం తక్కువన్నాట్ట. అమ్మకానికి పెడితే నాలుగెకరాలయినా అమ్ముడి." అన్నాడు కరణం.

సుబ్బన్న కొయ్యబారిపోయాడు. "నాలుగెకరాలే!" అన్నాడు. ఆ మాటలు గొంతుకలోనే ఉండిపోయినయ్. పెదాలు కూడ కదల్లేదు. ఉన్న పుట్టెడు భూమిలో నాలుగెకరాలమ్మితే ఇంకేం మిగులుతుంది? మిగతా వాళ్ళ పనేంగాను? నలుగురిలో తలెత్తుకోడం ఎలా? ఒక్క పెద్దకూతురి పెళ్లికే ఇంత ఖర్చా!

"జాగ్రత్తగా చేసుకుంటే నీకిదెంత? నాలుగేళ్ళలో కొట్టి పారేయగలవు."

"ఎలా తీరద్దండి, ఏడాది కైదొందలు పాయిదా పెరుగుతుంటే? నాకొంప గుండమైపోయింది" కర్రచివర్ని గెడ్డం ఆన్చి, కర్ర నేలని ఆనినచోట చూస్తూ అన్నాడు సుబ్బన్న. కళ్లంట నీళ్ళు తరువాయి. ఇంకా మాట్లాడితే గట్టిగా ఏడవాల్సిన పరిస్థితి వచ్చేలాగుంది. కుర్రాడు చదువుకున్నాడని చెప్పి అందరూ తనకొంప తీశారు. "ఉజ్జోగం చేసుకుంటాడు, పిల్ల సుఖపడుతుంది." అన్నారు. పెళ్ళికి వచ్చిన వాళ్లంతా తనని పొగిడారు, ఇంతకట్నం ఇచ్చి పెళ్ళిచేస్తున్నందుకు. మంచి సంబంధం తెచ్చాడట. అన్నీ నిజమే అనుకుని సంతోషించాడు తను.

"మాట్లాడవేం? ఏదయినా ఆలోచించి చేయడం మంచిది. పరుగెత్తి పాలుతాగే కంటే నిలబడి నీళ్లుతాగడం మేలు. నేను చెప్పానని కాదుగాని నువ్వూ ఆలోచించి చూడు." అని హెచ్చరించాడు కరణం.

"చేతులు కాలింతరవాత ఆకులు పట్టుకుని ఉపయోగం ఏంటి లెండి. అంతా అయిపోయింది. అప్పుడా రేలునిలవుంటే- చెప్పుకుంటే సిగ్గు - చేనుకొందామనుకున్నాను. అసలు దానికప్పుడే పెళ్లి చేద్దా



# మేడమీద మల్లి

కునుకోలేదు. 'నిక్షేపంలాంటి సంబంధం చేసెయ్' అన్నారు."

"ఏం జేస్తాం, ఎలా జరగాలని ఉందో అలా జరగాల్సిందే."

"అంతే లెండి" అంటూ సుబ్బన్న తలెత్తేటప్పటికి ఎదురుగా రామం కనిపించాడు. "నువ్వెప్పుడొచ్చావురా" అన్నాడు.

"నిన్న సాయంత్రం. సత్యం ఏం చేస్తున్నాడు?" సత్యం సుబ్బన్న అల్లుడు.

"ఏమో నాకేం చెప్పడు. ఒకళ్లు చెప్పినట్టు వినడట." కరణంవంక చూస్తూ "వస్తానండి" అని పోయాడు సుబ్బన్న.

"చిరాగ్గా ఉన్నాడేం?" కరణంవంక చూచాడు రామం.

కరణం పోయే సుబ్బన్నవంక చూస్తూ "పాపం దుక్కలాగుండేవాడెలాగయిపోయాడో చూశావా?" అన్నాడు.

"జబ్బు పడ్డాడా?"

"అంతకంటె ఎక్కువే. అప్పుల బెంగ. మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఉండే సంసారమూ" దీర్ఘం తీస్తున్నాడు కరణం వైరాగిలా.

"అప్పులా!"

"ఇప్పుడేం? పెద్ద కూతురి పెళ్లిదగ్గర్నుండీ అప్పులే. వడ్డీకి వడ్డీ పెరిగింది. చదువుకున్నాడని మురిసి బోలెడు కట్నం ఇచ్చి జోరుగా చేశాడు పెళ్లి."

కరణం చెబుతుంటే రామం స్తంభానికి జేరబడి వింటున్నాడు. సుబ్బన్న సమస్య వాణ్ణి దెయ్యంలా పట్టుకుంది. సుబ్బన్న మొన్నటివరకు మోతుబరి రైతు. ఇప్పుడు అప్పులు పెరిగినయ్యట. ఎవరి నోట్లో చూచినా సుబ్బన్నే. ఎంత లోకువైపోయాడు! కళ్లు మూసుకుని, వెనకా ముందూ



ఆలోచించకుండా, తాహతుకు మించి ఎవరు ఖర్చుపెట్టమన్నారు? మిగిలిన యిద్దరు కూతుళ్లకు పెళ్ళిచేయక్కర్లేదనుకున్నాడా! కొడుక్కి రాగిచిప్ప యిద్దామనుకున్నాడా?

"అల్లుడు యఫ్. ఏ. పేసయ్యాడా! ఏదో ఉద్యోగం చేసుకోకూడదూ! పెద్దది కావాలంటాడట. కట్నం సొమ్ముతో మోటారు సైకిలు కొని నాలుగురోజులు తిప్పి సగానికమ్మాడట. కట్నం అంతా ఇలాగే తగలెట్టాడు. ఇంతా అంతా కాదు, ఆరు వేలు. ఇక్కడ సుబ్బన్న పెట్టుబడికి డబ్బు లేక, అప్పులు పుట్టక కుమిలిపోతున్నాడు." అభినయంతో చెబుతున్నాడు కరణం.

ఇది ఇంకో వేలంవెర్రి అయిపోయింది. చదువుకున్నాడంటే చాలు మానవాతీతుడి క్రింద పరిగణించడం, దమ్మిడీ ఆస్తి లేకపోయినా వేలు కుమ్మరించడం. ఇంతా చేస్తే వాడు బ్రతికేది ఈ కట్నంమీదే. వీలయితే పూర్తిగా మామగారి మీద భారం వేస్తాడు. ఈరోజుల్లో గుమాస్తాగా సంపాదించిన 70 రూపాయలు పట్నంలో ఏమూలకొస్తయ్? అందరూ గెజెటెడ్ ఆఫీసర్లు కాగలరా? వీళ్ళకంటె ఉన్న యకరం దున్నుకుంటూ హాయిగా, చీకూ చింతా లేకుండా స్వతంత్రంగా బ్రతికేవాడు నయం కాదూ?

"అప్పుకోసం చేను అమ్మేస్తానంటాడు."

"ఎవరేం జేస్తారులెండి. కావలసిందే అలాగ." తనమీద భారం ఉన్నట్లు మాట్లాడుతున్నాడు రామం.

"బాగా చెప్పావ్ — సరే గాని ఇలాగొచ్చావెందుకు? ఎండలో!"

"అబ్బే లైబ్రరీతాళం కోసమని."

"దాన్లో నువ్వెరగనివి ఏమున్నయ్. లైబ్రరీ కామేశ్వరం మాస్టారితో వచ్చింది. ఆయనతోనే పోయినట్టుంది. నీలాంటివాళ్లు మళ్ళీ పూనుకోవాలి."

తను నిజంగా పుస్తకాలున్నయ్ చదువుదామని రాలేదు. లైబ్రరీలోని పుస్తకాలన్నీ చెదపురుగులు చదువుతున్నయ్యని తనకీ తెలుసు. ఏం ఊసుపోక వచ్చాడంతే. తాళం తీసికోకుండానే పోయాడు రామం.

పట్నంగోల కలవాటుపడిన రామానికి పదిరోజులవరకూ పల్లె వాతావరణం హాయి అనిపించింది. ఈ పదిరోజులూ రామానికి పదిగంటలుగా గడిచిపోయినయ్.

రత్తమ్మ తమ్ముడు సూర్యనారాయణ వచ్చాడు కాకినాడనించి. నారాయణకు కాకినాడ తాలూకా ఆఫీసులో గుమాస్తా పని. రావడం పెద్ద పనిమీద వచ్చాడు. కాంతానికి సంబంధం తీసికొచ్చాడు.

రంగయ్య, నారాయణ, రత్తమ్మ ఆవేళ రాత్రి ఒంటిగంటవరకూ కూర్చుని మాట్లాడుకున్నారు. అప్పటివరకూ తను తెచ్చిన సంబంధం గురించే చెప్పాడు నారాయణ. పెళ్ళికొడుకు తండ్రి తాశిల్దారు. ఇంకా ఎన్నో. ఆఖరు మాటగా "బి. ఏ. చదువుతున్నాడు. ఇది కాస్తా అయింతర్వాత బళ్ళతో తెచ్చి పడేస్తాడు. చేనుంటే ఎంత, లేకపోతే ఎంత?" అన్నాడు.

రంగయ్య మెత్తబడ్డాడు. అసలు సుబ్బన్న కూతురి పెళ్లిలోనే తట్టింది రంగయ్యకు కాంతాన్నికూడ చదువుకున్న

జోడి కిచ్చి చేయాలని. సుబ్బన్నకంటె వారుగా చెయ్యాలనుకున్నాడు. సుబ్బన్నంటే తనముందు ఎంత? పెళ్లిమంటపం ముందు కూర్చుని కలలుగన్నాడు. కాని సుబ్బారావు జ్ఞాపకం రావడంతోనే ముల్లు గుచ్చుకున్నట్లయింది. చిన్నప్పటినుండీ వాడికివ్వాలని అనుకుంటున్నారు. అప్పుడే కంగారెందుకులే అనుకున్నాడు. ఇప్పుడు మళ్ళీ నారాయణ దాన్ని రేపాడు. కాంతం చాల అందంగా ఉంటుంది. దాన్ని తప్పకుండా చదువుకున్నవాడికే ఇచ్చి చెయ్యాలి. ఫలానా రంగయ్య అల్లుడు ఇనస్పెక్టరు అంటే తనకి కాదూ! "సరే చూద్దాంలే" అన్నాడు రంగయ్య.

ఇక రత్తమ్మ సంగతి చెప్పనక్కర్లేదు. తన యిష్టం కాదు, చెప్పినా లాభం లేదని ఊరుకుందిగాని, ఎప్పుడో అనుకుంది. అప్పుడు రాజమండ్రి ఆస్పత్రికి వెళ్లినపుడు సుబ్బన్న అల్లుడింట్లోనే మకాం. సత్యవతి ఎంత దరసగా కాపురం చేస్తోంది! పూర్తిగా మాటతీరు అదీ అంతా మారిపోయింది. ఇల్లు ఎంత అందంగా ఉంది! గుమ్మాలకి తెరలు, ఎలక్ట్రిదీపాలు, ఎలక్ట్రీతో పాడే పెట్టె - అసలు ఉద్యోగస్థుల ఇళ్ళే అలాగుంటయ్. కాంతానికికూడ అలాంటి సంబంధం రావడం, భర్త ఒప్పుకోడం, రత్తమ్మ ఆనందానికి మేర లేదు. ముహూర్తం వెంటనే పెట్టేసుకుంటే బాగుండుననుకుంది. ఎందుకంటె సుబద్రమ్మ మాటలు విని మొగుడు మళ్ళీ మారిపోవచ్చు. ఇంటికొచ్చిన ప్రతి వారికీ చెప్పింది ఈ సంగతి.

నాలుగురోజులు గడిచాయి. "అయితే రత్తమ్మొదినీ మన కాంతానికి సంబంధం కుదిరినట్లే?" సుబద్రమ్మ దగ్గరనుండి సరాసరిని దొడ్డి తిరిగొచ్చింది సావిత్రమ్మ. సుబద్రమ్మ అమాయకత్వం ఎంత పని చేస్తుందో విప్పి చెప్పింది. "కర్రలేనివాణ్ని గొర్రి కరిచిందట. ఎంత మెత్తనిదానివే" అని వచ్చింది.

"ఔనొదినీ కుదిరినట్టే. కాకినాడట. ఏదో పెద్ద చదువే చదువుతున్నాడట; మాయది నాకు గేపకం ఉండదు. గౌరవమైన కుటుంబం. ఇంతకీ పిల్ల అదృష్టంలే." అంది రత్తమ్మ. ఈ విషయం ఎవరెవరికి చెప్పిందో ఎవరెవరికి చెప్పాలో జ్ఞాపకం ఉండడం లేదు రత్తమ్మకు. ఎందుకైనా మంచిదని అనుమానమొస్తే అంతా చెబుతుంది.

"మరి సుబ్బారావుకు చేసుకుంటాం అన్నారు కాదూ. సుబద్రమ్మ ఊరుకుందా?"

"తెలకడుగుతానూ, ఊరుకోక ఏం



జేస్తుంది? ఎవరికి తగ్గ సంబంధం వారికొస్తుంది. అల్లరి పెట్టడం ఎందుకు చెప్పు!"

"అది కాదు చిన్నప్పటినించీ..."

"వంద అనుకుంటాం అన్నీ జరుగుతయ్యా? మాటవరసకి; ఈడికీ అతనికీ సాటెక్కడా?" సుబ్బారావుని కాబోయే అల్లుడితో పోల్చింది.

ఒక్కసారిగా అన్నగారిలా మారిపోయినందుకు సుబద్రమ్మకు కష్టం కలిగింది. తన కొడుక్కి ఆస్తి తక్కువ ఉండడం వల్లనే రంగయ్య అలా తిరిగి పోయాడనుకుంది. రంగయ్యకు అసలు పిత్రార్జితమే ఎక్కువ. దానిమీద ఇంకో అంత గడించాడు. ఇప్పటివరకూ సుబద్రమ్మ తన ఆస్తి, అన్నగారి ఆస్తి అని వేరు వేరేమూడలేదు. అంతా ఒకటే అనుకుంది. రంగయ్యకేం, ఒక్కర్తే కూతురు. బోలెడు కట్నం ఇవ్వగలడు. కొడుకు పెద్ద చదువులు చదువుతున్నాడు. కొండంత కట్నం వస్తుంది. తన కొడుక్కేముంది. అంతా పోగుచేస్తే ఆ రెకరాలు అంతే.

ఏదో తగిన సంబంధం రాకపోదుగాని తనకొడుకుని బీదవాడినిగా చూచి తేలిగ్గా తీసేయడం సహించలేకపోయింది సుభద్రమ్మ. అదీగాక వాడింకా చిన్నవాడు. ఒంటరిగాడు. మేనమామే ఇలా చేస్తే వాడందరికీ లోకువైపోతాడేమోనని ఆమె భయం. ఎన్ని విధాల ప్రయత్నించాలో అన్నివిధాల ప్రయత్నించింది. బ్రతిమాలింది. "నీకిది తప్పదన్నయ్యా. నువ్వే ఇలాగ చేస్తే వాడందరికీలోకువైపోతాడు." అంది. ఏడ్చింది. "చిన్నప్పటి నుండి కడుపులో పెట్టుకుని పెంచి ఇప్పుడిలాగ చేస్తావనుకోలేదు. ఆ మారాజుపోయినప్పుడు కూడ నాకింత కష్టం కలగలేదు." అంది.

బెదిరించింది. "ఈ పెళ్లే నువ్వు చేసుకుంటే నేను నీగడప తొక్కను. నేను రాకుండా ఎలాగ చేసుకుంటావో చేసుకో." అంది.

నలుగురిచేతా చెప్పించింది. "నిక్షేపం లాంటి కుర్రాడు. వాడికేం తక్కువ? వాడికే ఇస్తే- నీకంటె తెలివైన వాడు" అన్నారు. అన్నిటికీ రంగయ్య చిన్నగా నవ్వి ఊరుకున్నాడు.

సుబద్రమ్మ రంగయ్య ఇంటికి కెళ్ళడం లేదు. రంగయ్య చలించలేదు.

"సుబ్బారావు లేడమ్మా?" చెంచయ్య వచ్చాడు.

"ఎందు కన్నయ్యా? ఇప్పుడే అన్నం తిని చేలో కెళ్ళాడు" అంది సుబద్రమ్మ. ఆమె గొంతుక మారిపోయింది. మాట గొంతుకలోనే ఉండిపోతుంది.

"ఎందుకమ్మా అంత యిదవుతావ్? దగ్గరనేగాని, ఆ మాత్రం సంబంధం రాకపోదు" అన్నాడు చెంచయ్య, సుభద్రమ్మ ముఖంలోకి చూస్తూ.

"గీత అలా గుందనుకోవాలి అంతే"

"పోనీ. చూశావూ కామరాజు కూతుర్ని చూశావా? దాన్ని చేసుకుంటేనో?" దిక్కులు చూస్తున్నాడు చెంచయ్య.

కొరడా దెబ్బల్లా తగిలాయి ఈ మాటలు సుబద్రమ్మకు. "ఈ మాట నువ్వే అంటున్నావా? ఎవరయినా అడగమన్నారా?" అంది సుబద్రమ్మ.

చెంచయ్య ఉక్కిరి బిక్కిరయ్యాడు. "అబ్బే! ఏం లేదు. చేలో కెళ్లాడా?" అంటూ వెనక్కి చూడకుండా పోయాడు. సుబద్రమ్మ కుమిలికుమిలి ఏడ్చింది. తన వాళ్లంతా కూర్చునేచోటికి కూడ కామరాజుకు రావడానికర్హత లేదు. కామరాజు ఆ వూరికి పదిహేను సంవత్సరాల క్రితం కడుపు చేత్తో పట్టుకుని వచ్చి, చేలు పాలికి చేసుకుని బాగా గడించాడు. ఎక్కడినుండి వచ్చాడో, అతని కుటుంబం ఎటువంటిదో ఎవరికీ సరిగా తెలియదు.

రామాని కప్పుడే పల్లెటూరివాతావరణం మొహం మొత్తింది. అమాయకత్వంలో



# మేడమీద మట్టి

ఆనందం ఉంది. కాని అందులోనే సర్వనాశనం చేసే యాటంబాంబులు కూడ పుడుతుంటయ్ అప్పుడప్పుడు.

రాముం అరుగుమీద కూర్చున్నాడు. రాయుడు వచ్చి రాముం దగ్గర కూర్చున్నాడు. "మాటాడకుండా అలా కూకుంటావేం? ఏదోటి చెప్పాలిగాని. మొన్న కరణంగారింటి కొచ్చి నబ్బాయిని కదిపి ఒదిలేస్తే గడగడగడ వాగేసేడు" అన్నాడు.

"అంత యిదిగా ఉంటే ఓసారి రాగూడదూ పట్నం, అంతా చూద్దువుగాని. ఎంత ఉన్నా చేనుకోనాలనే."

"నేనేం కొన్నానోయ్. ఆమాట కొస్తే మా నాన్నె రాయించుకుంటున్నాడు, సుబ్బన్న చేను, ఎకరం పదకొండొందలు చేసి."

"పదకొండొందలా?"

"ఊఁ! ఏం? మీ నాన్నకి పోటీ ఎవరొత్తారు?"

"అబ్బో! అదే మంచిదయితే నవ్వ్వారుసంటావా?"

రాముం అన్నమాట రాయుడికి బాగానే ఉన్నట్టు తోచింది. చేనేమో బంగారం లాంటిది. పండకపోవడం ఉండదు. ముందు నీరందుతుంది. ఏక చెక్క. తను ఇంకో యాభై అంటే రంగయ్య తన పీక తీస్తాడా? ఎవడో కొంటున్నాడని తనూరుకోవడమేమిటి?

"మాట్లాడవేం? ఏమిటాలోచిస్తున్నావ్?"

"ఉండవా, వత్తాను. నీకేం తెగ బలిసి మాట్లాడుతున్నావ్." అంటూ తలపాగ విడిచిపెట్టి పోబోయాడు రాయుడు. "తలపాగ వద్దా," అన్నాడు రాముం.

ఆరోజు సాయంకాలమే రంగయ్య రుసరుసలాడుతున్నాడు. చెంచయ్య తో రాయుడి దగ్గరకు కబురంపాడు. చెంచయ్య రంగయ్యకు కుడిభుజం. చెంచయ్యకు పశువుల్నిచ్చి, పెట్టుబడికి అప్పు ఇచ్చి సాయం చేస్తుంటాడు రంగయ్య.

"సుబ్బన్న చేను రంగయ్య కొంటాడట బాబూ" అన్నాడు చెంచయ్య రాయుడితో.

"కానుకోమన్నా! ఇదేం సిఫారసు? ఎవరెక్కువంటే ఆడికే ఇత్తాడు."

ఆ మాటే చెంచయ్య రంగయ్యతో చెప్పాడు. తోకతొక్కిన త్రాచులా లేచాడు రంగయ్య. "ఓహో! అయితే నేనేం గాజులు తొడిగించుకోలేదు. అదీ చూద్దాం. వీడి దెప్పుడూ యెదవ బుద్దే యెదవ బుద్ధంట." తుపుక్కున ఊశాడు.

సుబ్బన్న చేనుగురించి పోటీ పడుతున్నట్లు మర్నాడే ఊరంతా పాకింది. చెరువు గట్టుమీద పాకలో కూర్చున్నవారందరూ ఎవరికి తోచినట్లు వారంటున్నారు. ఈ విషయం తప్ప మాట్లాడుకోడానికి వేరే సంగతు లేమీ లేవు వాళ్ళకి. "లేకపోతే బంగారంలాంటి చేను పదకొండొందలకి పడేసుకుందామనుకున్నాడు కాబోలు." అన్నాడు కోటయ్య నడిచెక్కలు చీరుతూ. రంగయ్యంటే కోటయ్యకు కోపం. అతనూ చెంచయ్య కరణం చేనుగురించి పేచీ పడుతుంటే, రంగయ్య చెంచయ్యకిప్పించాడు.

"అయినా రంగయ్య కుదుర్చుకున్న చేనుకు రాయుడు పోటీపడ్డం ఎందుకు?" నార పినిపెడుతూ అన్నాడు వెంకన్న. వెంకన్న కూడ చెప్పుకోదగ్గ రైతే. రాయుడు పోటీకి రాకపోతే తనుగూడ ప్రయత్నం చేద్దామనుకున్నాడు, చవకగా వస్తుందని.

"మంచి పోటీ పడిందిలే. సుబ్బన్న అదృష్టం. రెండేలదాకా రావచ్చు" నార తడప వెంకన్న కందిస్తూ అన్నాడు సత్తియ్య.

రంగయ్య, రాయుడు ఊరికి పెద్ద రైతులు. సమాన ఉజ్జీ. ఇద్దరిమధ్య పడిన పోటీతో ఊళ్ళోవాళ్ళకి బాగా కాలక్షేపం అవుతోంది. ఏమౌతుందో అని అందరికీ ఆత్రుతగా ఉంది.

కాని ఈ కాలక్షేపం చూస్తుండగానే ఇంద్రజాలమై కూర్చుంది. చేను ధర మూడువేల రెండొందలకు పెరిగింది. ఎవరికీ ఖాయపడలేదు. తొలకరివాన కురిసింది. రంగయ్య, రాయుడూ ఇద్దరూ సుబ్బన్న చేలో విత్తనాలు జల్లడానికి తయారయ్యారు. చూస్తూ ఊరుకుందామనుకున్నవారంతా రంగయ్య, రాయుడు అనే అయస్కాంతపు ముక్కలకు ఇనుపరజనులా అంటుకుపోతున్నారు. కొందరికిది స్వంతగొడవై పోయింది.

రంగయ్యతరఫున చెంచయ్య ఉంటే రాయుడి తరఫున కోటయ్య ఉన్నాడు. రంగయ్య పదిమందితో వెడితే రాయుడు పదిహేనుమందితో వచ్చాడు. "నీ కెంత కావలిస్తే అంతా యిత్తాను. చేను నాదని

చెప్పు." అన్నాడు రాయుడు సుబ్బన్నతో. రంగయ్యకూడా అదే ముక్క అన్నాడు. ఆ చేనుమీద రాయుడికెంత హక్కుందో రంగయ్యకూ అంతే ఉంది. అప్పటివరకూ మధ్యవర్తుల ద్వారా మాట్లాడుకునే రంగయ్య, రాయుడు ముఖాముఖిని తిట్టుకోడం మొదలెట్టారు. "నీదంతా కుళ్ళు" అన్నాడు రంగయ్య. "నీదంతా టక్కరితనం. దురాశ" అన్నాడు రాయుడు. "చేలోకి దిగావంటే నరుకుతా" అన్నాడు రంగయ్య. "మెళ్ళిరిసేత్తాను ఏమనుకుంటున్నావో" అన్నాడు రాయుడు.

రాయుడు రంగయ్య లిలా తిట్టుకుంటుండగా, సుబ్బారావు వేడిరక్తం రాయుడి దాప ఎద్దుని గట్టిగా కొట్టించడంతో అసలు కథ ప్రారంభమైంది. రాయుడి అరక ఆ దెబ్బతో మడిఅవతలకు పోయింది. చెంచయ్య నిర్భయంగా స్వంత గొడవలా కర్రెత్తాడు. "ఊరనుకున్నావా అడివనుకున్నావా?" అంటూ కోటయ్య దిగాడు. ఇటు పదికర్రలు అటు పదికర్రలు ఖణాఖణ మోగాయి. ఎవరూ చావకముందే విడిపోయారు. గట్టుమీద రాయుడి గొంతుక పోయింది. ఇంకా పంచె ఎగ్గడుతూనే ఉన్నాడు.

ఊరంతా అట్టుడికినట్లుడికిపోయింది. పల్లపువీధిలోనుంచి నలుగుర్ని తీసికొచ్చి కోటయ్య రాయుడింట్లో మీటింగు పెట్టి మాట్లాడాడు.

"కలబడ్డారు ఏం ధైర్యమో చూడు." అన్నాడు ఒకడు.

"ఏంటో మరి ఆళ్ల ఉద్దేశం? ఈళ్ళంత చేతకాని వాళ్ళనా?" ఇంకొకడికి అనుమానం వచ్చింది.

"ఇంతదాకా వచ్చిం తర్వాత ఊరుకోగూడదు మామా. కొట్టి పట్టుకెల్తారా? ఊరుకుంటే ఎంత లోకువా?" అన్నాడు కోటయ్య.

"అవున్నా. అదేటో నేనూ చూత్తాను. బలవంతాన్ని రాయించుకుంటాడా? ఏఁవన్నా అవసరం పడితే—ఎంత డబ్బయినా సరే పాలెంవోళ్లు మన తరఫున ఉంటేలాగ చూడు కోటయ్యా" అన్నాడు రాయుడు.

పల్లపు వీధంతా రాయుడి తరఫు నుంటే మెరక వీధంతా రంగయ్య తరఫున ఉంది. "కాఁవరాజును కలిసేవంటే, కొత్తూరంతా కాఁవరాజు చెప్పినట్టు వింటుంది." చెంచయ్య రంగయ్యకు సలహా చెప్పాడు. అవును నిజమే. కాఁవరాజంటే గురి కొత్తూర్లోవాళ్ళకి.

రాత్రి తొమ్మిది గంటలకు పల్లపువీధి చుట్టు తిరిగి రంగయ్య కామరాజింటి కెళ్ళాడు. "అబ్బే పాలికాపుదగ్గర కెళ్ళి వస్తూ ఇలాగొచ్చాను. ఇవాళ జరిగినసంగతి విన్నావా?" అన్నాడు రంగయ్య. రంగయ్య పనిగట్టుకుని తనదగ్గరకు వచ్చి చెప్పడం కామరాజుకు సంతోషమయింది. తను ఎంత డబ్బు సంపాదించినా ఊళ్ళో గౌరవం మాత్రం సంపాదించలేక పోతున్నాడు. తను బీదవాడుగా ఉన్నప్పుడెలా చూచేవారో ఇప్పుడూ అలాగే చూస్తున్నారు. అనవసరంగా మొన్న గట్టుదగ్గర రాయుడి ముందు బుర్ర వంచుకోవలసివచ్చింది. ఇప్పుడు రంగయ్యకు రాయుడికీ పడింది. రాయుడికి బుద్ధి చెప్పాలంటే ఇదే సమయం. "ఊరుకున్నావేంటి నాన్నా. నీకున్నంతమంది వెనుక నాకుంటే అక్కడే కింద పడేసి తొక్కే వాణ్ణి. ఈసారి మళ్ళీ..."

"అసల్లందుకే వచ్చిందిలే. అందర్నీ కూడదీస్తున్నాట. అదీ చూద్దాం అని వచ్చాను."

కామరాజు ఇంత త్వరగా తనపక్షం చేరతాడని అనుకోలేదు రంగయ్య. ఈసారి రాయుడు దెబ్బలాటకే వస్తాడో, ఏం చేస్తాడో చూస్తాను, అనుకున్నాడు రంగయ్య.

రంగయ్య కామరాజులు రాత్రి పన్నెండు గంటలవరకూ మాట్లాడుకున్నారు.



"అమ్మాయి పెళ్లి కుదిరిందట నిజమే?" కామరాజు అడిగాడు. కొంతం పెళ్లి కాకినాడలో కుదిరితే, సుబ్బారావుకు తన కూతుర్ని ఇవ్వాలని ఉంది కామరాజుకు. రంగయ్యతో సంబంధం కలుపుకుంటే గౌరవం దానంతటదే వస్తుంది. ఎలాగయినా ఈ సంబంధం చేయాలి.

"ఆఁ! కుదిరినట్టే" అన్నాడు రంగయ్య.

"మరి సుబ్బారావు పెళ్లిప్పుడు చెయ్యవూ?"

"చెయ్యాలనే ఉంది, ఏదో సంబంధం చూసి."

'ఏంలేదు. మా అమ్మాయి నివ్వాలని ఉంది. నీకు తెలియందేముంది? కట్నం నువ్వడిగినంత!" అన్నాడు కామరాజు, కొంచెం ముందుకు వంగి రంగయ్య ముఖంలోకి చూస్తూ. రంగయ్య కొంతసేపటి వరకూ మాట్లాడలేదు. "దాంతో కూడ మాటాడాలి కదూ. చెప్తాను" అన్నాడు.

తాడు తెగి పోనీయకూడదు, అనుకున్నాడు కామరాజు. తర్వాత ఒక్క మాట కూడ మాట్లాడుకోలేదు వాళ్ళు.

కామరాజు రంగయ్యతరఫున చేరాడు అని తెలియడంతోనే రాయుడు "ఈడూ ఓ మనిషే! ఆ యెదవ అంపె చేరాడంట, చీమూ నెత్తురు లేని మనిషి. ఛీ." అన్నాడు.

ఇదంతా జరిగిన నాలుగోనాడు ఊరికి పడమర బ్రహ్మాండమైన కాంతి కనబడింది. అందరూ పరుగెత్తారు. రంగయ్య చేలో రెండువందల రూపాయలు చేసే గడ్డిమేటు నిలిచి కాల్తోంది. ఎగబడి ఆర్పడం మొదలెట్టారు. మేటు ఆర్పడానికి ఎవరెవరు రాలేదో చూడమని కొంతమందిని నియమించాడు రంగయ్య. రానివాళ్ళంతా తన శత్రువులు.

రంగయ్యమేటు తగులబడ్డం రాయుడికి భయాన్నే కలిగించింది. అది తను తగలబెట్టించలేదు. ఆ పని తను చేయించేడని అనుమానంతో అవతల రంగయ్య పరవళ్లు తొక్కుతున్నాడు. తనకేం తెలియదని చెప్పినా ఈ పరిస్థితులలో ఎవరూ నమ్మరు. రంగయ్య ఊరుకోడు. అంచేత ముందే జాగ్రత్తపడాలి.

రాయుడు తనగడ్డిమేటు దగ్గర కొత్తగా కాపలా వేయడం, రంగయ్య గడ్డిమేటు కాలిపోయిన సంగతి తనకి తెలియనట్టు ముసలుకోవడం చూసేసరికి, ఆ పని రాయుడు చేయించినట్టు అందరికీ అర్థమైపోయింది.

"ఎంతపని చేయించాడు!" అన్నాడు

(53-వ పేజీ చూడండి)



నడి వేసవి చివరలో పడమటి శాంబరం జోరయింది. ఎక్కడి జీవాలక్కడే ఆవిరి పట్టినట్టు ఉడికిపోతున్నయ్. బెజవాడ కొండలనించే నిప్పుగాలులు లేచి వీస్తున్నట్టుంది. ఏ ఊరు ఎక్కడ చూసినా నీరసంగా నిశ్శబ్దంగా పడిఉంది.

కోటపల్లె ఊరంతా పాటిదిబ్బలమయం. వేసవి రావడంతో ఎక్కడికక్కడ గజం లోతుదాకా దుమ్ముదుమ్ము అవుతుంది. ఇక ఊరి మధ్య పెద్దబజార్లో నడిచేందుకే ఆస్కారం ఉండదు. పెద్దబజారుని ఆనుకునే తాతలనాటి పాతసత్రం వొకటి ఉంది. దాంట్లో ఏనాటినించో కాపరం పెట్టి కూచున్న దెయ్యాల్నీ, బూజునీ వదిలించి పత్రికలూ పుస్తకాలూ తెప్పించి నలుగురు కుర్రాళ్లు దానికి యోగ్యత కలిగించారు.

వేసవిలో ఎండెక్కేసరికి, బజార్లో ఒక పురుగన్నా కనిపించదు. నలుగురైదుగురు వయసుమళ్లిన వాళ్లు ఆ సత్రంలో కూచుని పూసుపోక కబుర్లాడుకుంటుంటారు. చదివే నాథులు లేక, పత్రికలు గాలికి అటూ ఇటూ ఎగిరిపడుతున్నాయ్. రేగిన బజారుదుమ్ము ఇళ్ల గోడలనిండా చారలు చారలుగా పేరుకుపోయింది. చాళ్ళేసిన మెట్టపొలమల్లే ఊరంతా దుమ్ముకమ్ముకుని ఉంది. మళ్ళా వానాకాలం వొస్తే కాని...!

చింతాకన్నా కదలకుండా గాలి ఆగిపోయింది. పై బట్టల్ని తీసేసి, సత్రం మనుషులు చెమటల్ని ఆర్పుకుంటూ, ఆయాసపడుతున్నారు. ఒకరిద్దరు పై బట్టల్ని తడిపి కప్పుకున్నారు. రాళ్లు పగిలే ఎండని గురించీ, ఈ కాలంలో విరుచుకుపడే అగ్ని ప్రమాదాల్ని గురించీ దిగులు దిగులుగా చెప్పుకుంటున్నారు! పెద్దపెద్ద సుడిగాలుల రూపంలో దెయ్యాలు వొచ్చేసి ఎలా వేధించేదీ కథలుగా వర్ణిస్తున్నారు.

హఠాత్తుగా 'బంయ్' మన్న మోత విని సత్రం మనుషులు ఉలికిపడ్డారు. పడమరగా చెరువువేపునించి పెద్ద బూడిద మేఘం తుఫాన్లాగా హోరెట్టుకుంటూ వొస్తోంది! గట్టుమీద ఆరేసిన బట్టలన్నీ పైకెగిరాయ్. రంగురంగుల బట్టలన్నీ గోళాకారంగా తిరిగిపోతున్నాయి. సుడిగాలి రంగులు తీర్చిన పెద్ద గాలిగోపురంలాగా ఉంది! బజార్లోని వందలబళ్లకొద్దీ మట్టి మెలికలు మెలికలుగా పైకి లేచి, గాలి గోపురానికి మెట్లు అమర్చినట్లు కనిపిస్తోంది! ఇళ్లమీది తాటాకులూ, చెత్తా చెదారం ఏవో ఆకుల్లాగా తీగల్లాగా గిరగిరా తిరిగిపోతున్నె. ఎవరో పెద్దగా వందల గొంతుకలతో మూలిగినట్లు 'బంయ్' 'బంయ్' మని విషాదస్వరం వినిపిస్తోంది! నిజానికి ఇదంతా ఒక రెప్పపాటు కాలంలోనే...

అల్లంత దూరాన దాన్ని చూడగానే సత్రం మనుషులికి గుండె లవిసిపోయాయ్. సరాసరే బజార్న పోతుందికదా అని అనుకున్నారు. అలానే నిశ్చేష్టితులై, దాని వేపే చూస్తూ కూచుండిపోయారు. సుడిగాలి ఒక ధర్మదేవత అని పల్లెటివారి గట్టి నమ్మకం! పాపం, దాని తోవ తప్పించి మరో అంగుళం మేర స్పృశింపదట!! సత్రం మనుషులు దాని ఉచ్ఛ్వస్వరాన్ని, రూపాన్ని దిగులుగా భరిస్తూ కూచున్నారు!

నిమిషమన్నా గడవలేదు, ఇంతలో...

సుడిగాలి సత్రం దాటి వెళ్లలేదు. సత్రం వేపే మళ్లింది! ఇప్పుడు గోపురాకారంలో లేదు. వ్యూహం పన్నిన సైన్యంవలె త్రిముఖంగా సత్రాన్ని చుట్టుముట్టింది! అనుకునీ

శ్రీ నార్ల
చిరంజీవి

అనుకోకుండా ఉన్న సమయంలోనే సుడిగాలి విరుచుకుపడడంచేత, సత్రం మనుషులు బేజారెత్తిపోయారు. దుమ్ము దుమారం శరవేగంతో ముగ్గోళ్ళనించి గుండెలికీ మెదడుకీ పట్టేసింది! మంత్రదష్టులైనట్లు, సత్రం మనుషులు మెలికలు తిరిగిపోయారు. ముక్కూ మొగం, బట్టల్తో కప్పుకుని, దుమ్మునించి తప్పించుకుందామని ప్రయత్నించారు. లాభం లేకపోయింది! ఆ గందరగోళానికి కట్టుకున్న బట్ట లూడిపోయాయే కాని, మరో ఫలితం కనబడలేదు. సింహాద్రి అప్పన్న గంధం పూతవలె, మనుషులు దుమ్ముతో నిండిపోయారు. పట్టెడు దుమ్ము గొంతులోకి దిగిం తర్వాత కాని, నాలిక పనిచేయలేదు. సత్రం మనుషులకి రొప్పూ, రోదన ప్రారంభమయ్యాయి.

అలాంటి భయంకర వేసంగుల్లో ఇలాంటి భీభత్స కాండలు సహజమైపోయాయి. కేవలం దీన్నిగురించే నేను చెప్పాలని కాదు: ఇంత చీదరగొట్టు సుడిగాలిలోనూ, వొంచిన తల ఎత్తకుండా బజారువెంట వెళ్లిపోతూన్న గంగన్నని గురించి నే చెప్పదలచుకుందీ; మీరు వినవలసిందీను...

అంతటి ఆయాసంలో కూడా సత్రం మనుషులు గంగన్న పోతూన్నవైనం చూసి రెల్లపోయారు. అంతే...

## 2

ఆ ఊరి ఆబాలగోపాలం 'గంగన్న'ని ఎరుగుదురంటే ఆశ్చర్యంలేదు. ఎంత కటికచీకట్లో ఐనాసరే, గంగన్న బజార్న వెళుతూన్న సంగతి ఇళ్లల్లో ఉన్నవాళ్లుకూడా గుర్తు పట్టేస్తారు. ఇందు క్కారణం: గంగన్న తొడుక్కునే కిర్రుచెప్పులమోత, పొన్నుకర్రపోట్లూ: ఎంత దూరమైనా వినిపిస్తాయి. తిండి తినే ఆ గడియసేపు మినహా, సదా ఆ కోర తలపాగా, కాళ్లకి కిర్రు చెప్పులు, చేతిలో పొన్నుకర్రా ఉండవల



సింజే! అవి లేకుండా ఈ పాతికేళ్లల్లో ఎవరూ అతన్ని చూసిఉండరు!

కాని, ఇవాళ, ఇంత ఎండలో, పైగా ఇంత సుడిగాలి దుమ్ములోంచి కూడా కర్ర లేకుండా, చెప్పుల్లేకుండా బజారున పడి వెళిపోతున్నాడు. తలపాగా లేదు. నిండా ముసుగు కప్పుకున్నాడు. సత్రం మనుషులు గంగన్నని ఎగాదిగా చూశారు. గంగన్నని పోల్చుకునేసరికి అతను సత్రం దాటిపోయాడు. సత్రం మనుషులు పిలిచిన కేక అతనికి వినిపించనే లేదు.

గంగన్న ఇంటికి పోతున్నాడా? కాదే! చెరువువేపుకి వెళుతున్నాడు. దోవలో ఇద్దరు ముగ్గురు ఎదురయ్యారు. వాళ్ళని తప్పుకుని నాలుగడుగులు ముందుకు సాగాకేసరికి గాని వాళ్లు పోల్చుకోలేకపోయారు. పోల్చుకున్నాక "—ఆఁ, ఎవరు? గంగన్న మాఁవా?" అని అన్నారు!

కాని - గంగన్న వెనక్కి తిరిగి చూళ్ళేదు. కాలవ వంతెనమీదుగా పోయి చెరువు కట్టెక్కాడు. చెరువుగట్టుమీద తాతలనాటి మర్రిచెట్టు ఉంది. ఊడలు దిగి వేయి స్తంభాల మంటపంలాగ ఉంటుంది. పొలంనించి ఇళ్ళకు మరలేవాళ్ళకీ, ఇళ్ళనించి పొలాలకు వెళ్ళేవాళ్లకీ అది పెద్ద మజిలీ. అక్కడ కూచున్న వాళ్లందరికీ ఎడంగాపోయి కూచున్నాడు గంగన్న.

"అదేఁవిటి, గంగన్న బాబాయ్! అలా ఉన్నావ్?"

అన్నాడు రామయ్యగారి గోపాళం.

గంగన్న మాటాడలేదు. తలా వొకమాట అడిగారు. ఎవరికీ ఎలాంటి జవాబూ చెప్పనే లేదు. నలుగురూ చిత్రంగా చూశారు. కాసేపయాక ఎవరిదోవన వారు, గంగన్నని గురించే గుసగుసలాడుకుంటూ వెళిపోయారు. పొద్దు పడమటికి దిగింది. ఎవరూ లేరు. గంగన్న ఒకడే కూచున్నాడు.

అడపాతడపా వొచ్చే తొలకరి జల్లుల మధ్య, కాలవలు కొత్త నీరోసుకుని నిండుగా వొచ్చాయి. మొగి పొలాలకీ, దిగువ ఆకుమళ్లకీ నీళ్లు వొదిలారు. మొగి మళ్లు అచ్చాపచ్చాగా తడుస్తున్నై. కొంగలు బారులు తీరి, మునక్కుండా మిగిలిఉన్న గడ్డలమీద కూచుని, నీటిలో తేలే పురుగుల్ని తింటున్నాయి. తెల్లటి ఎండా, నల్లటి భూమీ, తెపకలు కొడుతూన్న నీళ్లూ, కొంగిలూ, గాలీ...అన్నీ ఒక విచిత్రమైన వాతావరణాన్ని కల్పించాయ్. గంగన్న ముఖ మెత్తి తడుస్తూన్న పొలాలవంక మరీ మరీ చూశాడు. అతని కళ్లు చెమ్మగిలి, కన్నీళ్లు టప్ టప్ మని జారుతున్నాయ్.

పాతికేళ్ళక్రితం:

ఉత్తరాదిన, ఒక మారుమూల పల్లెలో రెండెకరాల భూమీ, భార్యా, వొక కూతురూ, తానూ, ఉన్న కొంపా, అప్పుసప్పులు లేని బ్రతుకూ. అంతా అతనికి గుర్తు వొచ్చింది. దిగులూ దివాలా లేని జీవితంనించి - తానీ 'కోటపల్లె'కి ఎందుకొచ్చానా? అని అనిపిస్తోంది! ఈ భావం ఇంతకు ముందే వొకటో రెండు సార్లు వొచ్చినా ఎలాగో సర్దుకుపోయాడు. కాని, ఇవాళ అతనికా భావం గుండెల్లో సూదులు గుచ్చినట్లు గుర్తుకు వస్తోంది! బస్తీలో పాలమ్ముకునేవారి ఇళ్లల్లో బలవంతాన చచ్చే లేగదూడల బ్రతుకెలాంటిదో- సరిగ్గా తన బ్రతుకూ అలాంటిదేకదా అని తోచింది.

షావుకారు రంగయ్య పాతికేళ్ళక్రితం చచ్చిపోయాడు. విధవరాలు రావమ్మ మగదక్షత లేనిదై, ఉన్న ఆస్తిపాస్తి అల్లరవుతుందనే భయం పట్టుకుని, కాకుల్లాగా చీమల్లాగా ముసురుకున్న రాజబంధువుల్ని మంచిమాటలతో సాగనంపి, నలుగురినోటా అల్లరిపడింది. ఐనా, సరేనని, ఉత్తరాదినున్న 'గంగన్న' విషయం ఎలాగో తెలుసుకుని, మనసుకి నచ్చచెప్పుకుని, పిలిపించింది. మాగాణి ముప్ఫయి యెకరాలూ, మెట్ట ఏడెకరాలూ యావత్తూ గంగన్న అజమాయిషీకి అప్పజెప్పి రావమ్మ 'దొడ్డ ఇల్లాలు' అనీ, 'ఆడదైనా గడుగ్గాయి' అనీ అనిపించుకుంది! తనతో మాటమాత్ర

# కర్రా చెప్పులు

మన్నా చెప్పకుండా ఆడది స్వతంత్రించి ఊరుకొని ఊరినించి వొకణ్ణితెచ్చి 'మేనేజరు'ని చేస్తుందా అని, సత్రం మనుషులు రుసరుసలుపోయి మీసాలు సవరించారు. గంగన్న పడుచుసిరి, కర్రా చెప్పుల తీవి చూసి 'కోటలో ఖటీ వేశాడయ్యా!' అని గుసగుసలాడారు.

ఏదేమైతేనేం, పొలాలూ వాటికితగ్గ నౌకర్లూ చాకర్లూ ఏర్పడ్డారు. జయ్‌మని వ్యవసాయం సాగింది! ఏడాది మళ్ళి సంక్రాంతి వొచ్చేసరికి పుట్టెడుపండే దిగనాసి పొలం పదిహేన్లు రాలాయి. ముసిలీ ముతికల్ని అర్రు కడిగేసి గుంటూరుసీమకి పోయి నాలుగు జతల్ని కొడికలిసిన కోడె గిత్తల్ని తెచ్చాడు గంగన్న. తోటలూ దొడ్లూ కళ్లు తిరిగేలాగ నిండిపోయాయి.

రంగయ్య ఏడూరికి వొచ్చిన రాజ బంధువులు విధవరాలు రావమ్మతో సాహసించి సలహా సంప్రదింపులు సాగించలేకపోయినా, 'ఎవర్నైనా పెంచుకోవలసింది' అని మాత్రం చెప్పారు. వచ్చినవాళ్ళంతా గంగన్నని పలకరించి, రంగయ్య బ్రతికి ఉన్న రోజుల్లో తను కెలాంటి లావాదేవీలు ఉండేవో చెప్పుకున్నారు.

గంగన్న ఉలకాలేదు, పలకాలేదు: బంధువులు వెళ్ళేముందు మళ్లా రావమ్మని హెచ్చరించే వెళ్లారు. తలకొరివి పెట్టడానికైనా వొకడు కావాలి కనక, రావమ్మ ఆలోచించి ఆలోచించి, గంగన్నని పిలిచింది:

"మూలపాడులో మావాళ్ళ కుర్రాడు ఉన్నాడు. వాణ్ణి నువ్వోసారి చూసి రావాలి. నీకు నచ్చితే, పెంచుకోవాలని ఉంది. ముందు చూసిరా!" అని అంది రావమ్మ.

గంగన్న మూలపాడు వెళ్ళాడు. ఆ చుట్టాలకొంప మరీ చిన్నది. ఎదురుగా చిన్న చావిడి. కాయకష్టంమీద బ్రతుకుతున్నారు. చూడదలచిన కుర్రాడు రాజయ్య గొడ్లచావిట్లో పేడతీసి ఊడుస్తున్నాడు. పైకెగగట్టిన నీర్కావి పంచె; చిన్న బనీను. పదమూడేళ్ళుంటాయి.

"నాగలి పట్టగలవా?" కుర్రాణ్ణి పలకరించాడు గంగన్న. పనిపాటలు బాగానే చేయగల సత్తా కుర్రాడిలో కనిపించింది గంగన్నకి. మాటా మర్యాదాకూడా తేటగానే తోచాయి. వొళ్ళుదాచుకోకుండా భూమిని నమ్మిన కుర్రాడే కావాలి!

గంగన్న రావమ్మతో చెప్పాడు: "బ్రతికి చెడిన వాళ్ళని ఖరించడం మా చెడ్డ కష్టం. లేని వాళ్ళకి సిరివొస్తే, వొళ్లు మరిచిపోకుండా ఉన్నంతకాలం పిత్రార్జితం పెరుగుతూనే ఉంటుంది. చూస్తే, రాజయ్య కాయ కష్టంచేసే మనిషేకాని కబుర్ల పోతుకాదు. భూమిని నమ్మిన బిడ్డకి పుట్టెడు లాభమే కాని, మరో హాటి ఉండదు! ఎటు చూసినా రక్కాడొక్కా ఉన్నవాడుగానే కనిపించాడు. ఆ పైన మీ ఇష్టం......"

ఈ విధంగా ఆనాడు తాను చెప్పకుండా, మరోమాట చెప్పి ఉంటే, ఆ రాజయ్య ఈ రాజయ్య అయ్యేవాడేనా? తన బ్రతుకు ఇలా ఊదరపెట్టిన ఎలికలాగా అయ్యేదేనా? తాను చెప్పిన రాజయ్యేనా. గంగన్నకి చెమటలు పోశాయి. సన్నగా రివ్వగాలి సాగింది. తడిసిన పొలాల మీది నించి గాలి వచ్చగా వీస్తోంది! మళ్ళా మనస్సు వెనక్కి వెళ్ళింది...

మూలపాడులో పాడుకొంపలో బ్రతికే రాజయ్య రావమ్మకి దత్తత అయ్యాడు. లంకంత ఇంటికీ, బోలెడు ఆస్తిపాస్తులకీ యజమాని అయ్యాడు. నీర్కావి బట్టలు వొదిలేశాడు.

హఠాత్తుగా లాభించిన ఈ స్థితి, రాజయ్యమనస్సులో ఎలాంటి మార్పు తెచ్చిందో ఎవరికీ తెలీదు. కాని, 'గంగన్న'ని బాబాయ్ అని పిలవడం, అతని ఆజ్ఞలేనిదే అడుగైనా కదలకపోవడం, ఇంతమట్టుకి అందరికీ తెలుసు!

రావమ్మ రోజులు గడిచేకొద్దీ తల కొరివికి దిక్కయిన రాజయ్యని మనసారా ఆత్మీయుణ్ణిగా చేసుకోడానికి ప్రయత్నించేది. అంచేత పరాయికొంపలో పుట్టాడనే భావం ఏ సమయంలోనూ మనసులోకి రానీయకుండా ప్రవర్తించేది! గంగన్న చేతిలో పనిపాటలు దిద్దుకుని, ఆరిపోయే వంశదీపాన్ని వెలిగించడంలో రాజయ్య తగినవాడేనని రావమ్మ నమ్మకం! అన్నిటికన్నా గంగన్న మనసిచ్చి చెప్పాడు కదా!

మారుతూన్న కాలం విలువ గంగన్నకి తెలుసు. ఆ తెలివితేటలున్నాయి కనకనే ఆ సంసారాన్ని నెట్టుకురాగలిగాడు. ఇదివరకటిలాగా చేలో, దొడ్లో ఎంత ఉందో, ఎంత లేదో...దిక్కు మొక్కు లేని దివాణంలాగా ఉండనివ్వలేదు. పాలేళ్ళకి ఇచ్చి పుచ్చుకోవడాల్లో చాలా నిక్కచ్చిగా ఉన్నాడు. దస్తావేజుల ప్రకారం ప్రతిచేనూ మషాయిగు చేయించాడు. చుట్టూ సర్వేరాళ్లు కొత్తవి పాతించాడు. చేలకు నాలుగు వేపులా గట్లు సరిగా పెట్టించాడు.

"వీడి స్వంత సొమ్మయినట్లు తెగబడి లెక్కలు తీయిస్తున్నాడయ్యా!"

"ఇల్లుగల ఇల్లాలికి లేని దురద ఈయన కెందుకంటా? అయినవాళ్ళం మాదో గజం వాళ్ల భూమిలో ఉంటుంది. వాళ్లదో మూరెడు మా భూమిలో ఉంటుంది. అది మేమూ మేమూ చూసుకుంటాం! మధ్య ఈయన బోడిపెత్తనం ఏమిటి?"

ఆ 'బోడిపెత్తనం' మీద లేచిన గందరగోళం చప్పున తాటాకుమంటల్లే చల్లారిపోయింది! కొందరు మరీ కుళ్లి కుళ్లి బాధపడే వాళ్లుమాత్రం రావమ్మ చెవులదాకా గోడు పెట్టారు.

"పాటివాళ్లం! జబర్దస్తీ ఏం మర్యాద? రంగయ్య బావ బతికినంతకాలం లేని ఈ పేచీలు ఇప్పుడెందు కొచ్చాయి?"

"ఊరుకాని ఊరువాణ్ణి తీసుకొచ్చి పొలంమీద మేనేజర్‌ని చేశావు. పాటూడు పందిరేస్తే పిచ్చికొచ్చి పడగొట్టిందంట!"

వాళ్లందరికీ రావమ్మ చెప్పిన జవాబు ఆశ్చర్యం కలిగించింది "గంగన్న! పొరపాటు ఎప్పుడూ చెయ్యడు. అతను కాగితాల్లో ఏమి రాసివుందో అదే ప్రకారం గట్లు పెట్టించి ఉంటాడు. న్యాయంగా మాకు రావలసింది తప్ప ఆపైన అంగుళం నేల కూడా మాకక్కరలేదు. ఇక - ఆ అబ్బాయీ, ఈ ఇంట్లో పుట్టిన అబ్బాయీ వేరు కాదు. మంచైనా, చెడ్డయినా గంగన్న అబ్బాయిదే ఆఖరి మాట!"

అంతే, ఆ ఏటి ఊడ్పులు వొచ్చేసరికి ఎవళ్లకివాళ్లు సర్దుకున్నారు. వీళ్లంతా రావమ్మతో చెప్పుకున్న వైనం గంగన్న చెవిని పడకపోలేదు. విని నవ్వుకున్నాడు.

కూలీనాలీకి కుదురు ఏర్పడింది. చేసిన పనికి ఠంచన్‌గా ముట్టేది. మాట బీరుపోయేదికాదు. 'గంగన్న' పిలిచాడూ అంటే పనికి ముందు దూకేవాళ్లు. అదివరకు ప్రతిఏటా నీళ్ల తీత దగ్గర తగూలే! ఎవరికందినట్లు వాళ్లు గట్లు తెగ్గొట్టుకుపోయి, నీళ్లు వొడిలేవాళ్లు. గంగన్న హయాములో నీళ్లు సక్రమంగా వెళ్లవలసిందే కాని, దారి తప్పి చుక్కయినా జారడానికి వీల్లేదు. పొద్దెక్కేదీ, పొద్దోయేదీ చేలో వొంగిన కూలీనాలీ పని పూర్తికాందే వెళ్ళేవారు కారు.

రాజయ్యకి కొంత చదువు సంధ్య చెప్పిస్తే బావుంటుందని గంగన్న రావమ్మకి చెప్పాడు. రావమ్మ 'నీ ఇష్టం' అని ఊరుకుంది. కాలాన్ని బట్టి నాలుగు ముక్కలు రాకపోతే నలుగురిలో నగుబాటని గంగన్న ఉద్దేశం. దాంతో ఒక మేష్టరుని కుదిర్చి, పధ్నాలుగేళ్ల రాజయ్యని చదువులో పడేశారు.

ఇలా జరిగిన గాథంతా గంగన్నకిప్పుడు ఒకొక్కటే గుర్తుకు వొస్తోంది! రాత్రింబగళ్లు రక్తం వొడ్చి శ్రమించిన దానికి ఫలితం ఇవాళ ఏం జరిగింది? ఆ మూలపాటి రాజయ్యకి, ఆ రెండు ముక్కలూ చెప్పించాలనే పాడుబుద్ధి తన కెందుకు కలిగింది? ఆ చదువూ, గొడవా లేకుండా ఉంటే, తానెక్కడ పడి ఉండమంటే ఉండి, సరిగానే ఉండేవాడు. కాని ఏం లాభం?

మర్రిచెట్టు కింద కూచున్న గంగన్న బరువుగా నిట్టూర్చాడు. పక్క చెరువులో అలలు మందంగా కదులుతున్నాయ్.

## 3

చెరువుగట్టు దిగి దక్షిణంవేపు చూశాడు. కాలవకి పక్కగా, అల్లంత దూరాన మూడు గంగరావిచెట్లు కనిపిస్తున్నయ్. ఆ పొలమే, ఆ పొలమే...కళ్ళు చెమ్మగిలాయి గంగన్నకి.

మళ్లా కూచున్నాడు. లేచాడు. పడమటికి చూశాడు. పొద్దుగుంకబోతోంది. కాలవ డొంకలో ఇళ్ళకిమళ్లిన గొడ్లమందలు వస్తున్నాయి. అప్పుడే చల్లబడే లక్షణాలు లేవు. గంగన్నకి దాహం వేసింది. నాలికతో పెదవుల్ని తడుపుకున్నాడు. వొళ్లు కంపరమెత్తుతోంది. చప్పున పెళ్లాం బిడ్డలు గుర్తుకి వచ్చారు. ఒక్కసారి హఠాత్తుగా దక్షిణపువేపు చూశాడు. మూడు గంగరావి చెట్లు నిశ్శబ్దంగా నిలబడినట్టున్నాయ్.



తానూ, తన భార్యా, తన కూతురూ. ఆ పొలంలోనూ మూడు గంగరావి చెట్లు! ఒక్కసారి పైపంచె దులిపి, భుజంమీద వేసుకున్నాడు. డొంకవెంట బయల్దేరాడు. పొలం! పొలం!! అతని మనస్సులో, పరిపడనప్పుడు నూనె పదార్థాలు తింటే ఎలా తెములుతుందో, అలా తెములుతోంది! అదేదో బాధ! ఏదో మోసం, కుట్ర తన్ను నాశనం చేయడానికి ఇన్నాళ్ళనించీ, ఎన్నాళ్ళనుంచో మరి! - జరుగుతోందన్న మాట!

గంగన్న గుండె అగ్గిమీద గుగ్గిలంలాగా అయింది. డొక్క కోసినా అక్షరం ముక్క లేని, రాజయ్య మూలపాట్లో పేడపోగేస్తున్న రాజయ్య - పదేళ్ళలో ఎంత ప్రయోజకుడయ్యాడు! ఎంత వ్యవహర్త అయ్యాడు! కొంప నిలువునా దోచేసే కసాయివాడే నయమనిపించాడే! గంగన్న వొంట్లో నెత్తురు తుకతుకమంటోంది. ముఖం జేవురించింది.

నాలుగేళ్ళపాటు రాజయ్య బస్తీలో చదివేసరికి ఎంతో మారిపోయాడు. అతని అభిరుచులు, అభిప్రాయాలు చాలా మారేయి. గంగన్న ఒక జీతగాడు అనే సత్యాన్ని స్పష్టంగా తెలుసుకున్నదా రోజుల్లోనే. రావమ్మలాంటి దిక్కులేని వాళ్ల మదనష్టపు ఆస్తిని సద్వినియోగం చేయడం అనేది తన జన్మహక్కని రాజయ్య గ్రహించాడు. తన జీవితాన్ని అలా అర్థంచేసుకోవడంలో రాజయ్య ప్రయోజకత్వం సఫలమైనదనే చెప్పాలి. ఊళ్ళో ఉన్నన్నాళ్లూ, తనకు అధికారం ఉందని తెలీనన్నాళ్లూ, రాజయ్య కేవలం

# ★ కర్రా చెప్పులు ★

ఒక బొమ్మ అనీ; ఇప్పుడు అన్నిటికీ అన్ని విధాల అధికారం సంప్రాప్తించడంతో రాజయ్య ఒక ప్రయోజకుడనే -తనుమట్టుకు తాను భావించుకున్నాడు.

మెట్రిక్ రెండేళ్లు తప్పాక, రాజయ్యకి చేయవలసిన మహాకార్యాలు ఏమీ తోచలేదు. అంచేత తిరిగి "కోటపల్లె"కి పోయి వ్యవసాయాదులు చూసుకుంటే సరి! అనుకుని బయల్దేరాడు.

రాజయ్య బస్తీనించి వొచ్చేదాకా, ఇన్నేళ్ళ కాలం పొలాలు గంగన్న దగ్గరే ఉండేవి. ఊళ్ళో అప్పులు పెట్టవలసి వొచ్చినా, పనులు చేయవలసి వొచ్చినా అంతా గంగన్న చూసేవాడు. గంగన్నకి సంతకం పెట్టే చదువైనా రాలేదు. కాని, ఎవరితో ఏ పనులు సర్దించుకోవాలో తెలుసు. ఊళ్ళో కరణం గారిచేత ఇంటి లెఖ్ఖాడొక్కా అంతా అణాపైసలతో సహా రాయించేవాడు.

ఇక పొలంలో కిట్టుబాటుకాదానికి వీల్లేదు. రాత్రింబగళ్ళు గానుగలాగా పొలాలన్నీ తిరుగుతూండేవాడు. వొచ్చినపంట కాలమానాన్ని బట్టి అమ్మేసి మంచి వరకైన భూములు కొనేవాడు. ఇలాగ ఆ ఆస్తి అలా అలా పెరిగి ఎనభై ఎకరాలయింది. ఇంతగా ఇదవడానికి గంగన్న కారణం. ఆ సంగతి అందరికీ తెలుసు.

రాజయ్య ఇంటికి రావడం, ఇన్నేళ్ళ లెక్కలు పుచ్చుకోవడం అంతా సవ్యంగానే జరిగింది. ఇచ్చి పుచ్చుకోవడాలు గంగన్న మాట ద్వారా జరుగుతూన్నా, రాజయ్య అంగీకారం కూడా అవసరం అయింది. ఆ సంగతి గంగన్న గ్రహించాడు. రావమ్మకూడా రాజయ్య స్వయంగా చూసుకోవడమూ మంచిదేనని భావించింది. గంగన్న మీద నమ్మకం లేక కాదు: రాజయ్యకూడా వ్యక్తిత్వం పొందాడు కనక అలా ప్రతివిషయం పట్టించుకోవడం అవసరమని రావమ్మ భావించింది.

ఏళ్లు గడుస్తున్నాయి.

గంగన్న శరీర పటుత్వం తగ్గిపోతోంది. కుటుంబంలో మార్పులు వొచ్చాయి. మాలపల్లో రెండెకరాలు అమ్మేశాడు. "కోటపాడు" లోనే స్థిరపడి పోదామనుకున్నాడు. అమ్మగా వొచ్చిన డబ్బు పెట్టి పొలం కొందామని ఆశపడ్డాడు. కొనతలచిన పొలం ఎంచుకున్నాడు. మూడు గంగరావి చెట్టున్న పొలమే అది. చాల కాలంగా బీరం పడి ఉంది.

డబ్బు రాజయ్యకి ఇచ్చాడు. గంగరావి చెట్టున్న పొలం సంగతి చెప్పాడు కూడా. గంగన్న తాలూకు రొక్కం ఏడు వేలున్నాయి. ఇంకా రెండు వేలు కావలసి ఉంది. ఇన్నాళ్లు నమ్మి ఉన్నందుకు రాజయ్య ఇవ్వకపోతాడా అని గంగన్న నమ్మకం! అసలు అందరనుకున్న దేమంటే, ఇన్నాళ్లూ ఆ సంసారాన్ని అంటిపెట్టుకున్నందుకు రావమ్మ ఏ నాలుగైదెకరాలో గంగన్నకి రాసి ఇవ్వగలదని అనుకున్నారు. ఔను, నిజమే మరి; 80 ఎకరాలు ఎవరి రెక్కల కష్టం?

గంగన్న పొలం సంగతి చెబితే, రాజయ్య విని ఊరుకున్నాడు. ఆస్తి పెరిగింతర్వాత రాజయ్య స్వభావంలో వచ్చిన మార్పుని, పెత్తనం మరింత కూర్చింది. కాలం మారడం గమనిస్తే కాని, మనసు మారడం చిత్రంగానే తోస్తుంది.

గంగన్న భార్య ఎన్నడూ మగణ్ణి దొక్కించి అడిగే స్వభావం కాదు. కాని, పొలం అమ్మిన డబ్బు రాజయ్య చేతికి ఇచ్చినప్పుడూ, గంగరావి చెట్టు పొలం కొనడానికి వొచ్చినప్పుడూ మొగణ్ణి కొన్ని కొన్ని అడిగింది:

"కాని ఊళ్ళో కలకాలం కాపరం చేస్తున్నాం. ఆ డబ్బేమిటో, ఆ పొలం ఏమిటో స్వంతంగా చూసుకోండి. బిడ్డగతి మన పాలబడ్డది. కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది. ఈసారైనా చేసుకుని కొన్న కాగితం ముక్క రాయించుకోకూడదా?"

గంగన్న నవ్వి:

"కాలం మారిందని మనసులు మారుతుంటారటే పిచ్చిదానా! మన డబ్బుకీ, పొలానికీ ఏం భయం లేదు లేవే!" అని అన్నాడు.

ఏడాది తిరిగింది.

రాజయ్యకి మనసులో ఏదో ఉంది. గంగన్నకీ మనసులో ఏదో ఉంది. అదేమిటో ఎవరికీ తెలీదు. వాళ్లల్లో వాళ్ళకైనా తెలుసా అనేది అనుమానమే! అనుమానం ఒక జబ్బు. ఆ జబ్బు అంటుకున్నాక రావణుండుగా మారుతుంది. ఆ అనుమానం ఏమిటో ఎవరూ పెల్లగక్క లేదు. నౌకర్లూ చాకర్లూ అందరూ గుసగుసలు పోతారు. అంతవరకే! రావమ్మ

ఎక్కడో కంటెంట్లోనే జీవితాన్ని గడుపుతోంది.

రాజయ్య ఇప్పుడు చిన్న వ్యవహారవేత్త. పంచాయతీబోర్డు ఎన్నికల్లో నిలబడ్డాడు. బస్తీనుంచి ఎవరో మిత్రులు వొస్తుంటారు; పోతుంటారు. రాకపోకల్లో, ఇంటా బయటా వ్యవహారాలు అన్నీ మారిపోయాయి. ఒకప్పుడు గంగన్నకి యజమానికి ఉన్న స్థానం ఉండేది. నేడది శూన్యం.

ఊళ్ళో, చేలో వ్యవహారాలన్నీ ఇంకా గంగన్న చేతిలోకి రాక తప్పడంలేదు. ఎవరు ఏది మాటాడవలసి వొచ్చినా 'మన

# కర్రా చెప్పాలు

"గంగన్నని పిలవండి" అని అంటారు. లేదా, మన గంగన్నని కొత్త సంప్రదించి చూడండి అని అంటారు. ఇది రాజయ్య సందేహం కాలం తోడినట్లయింది.

ఈ ఏడు దుక్కులకుముందే, గంగన్న ఈ పొలాలనించి తొలగిపోవడం మంచిదని భావించాడు. ఒకరోజున రాజయ్య వద్ద ప్రస్తావన తెచ్చాడు.

"వయసైపోయింది. ఇంకా పొలానికి పోయే ఓపిక తగ్గింది. ఇక ఇంటిపట్టునే ఉంటాను." రాజయ్య గంగన్న మాటలు విన్నాడు. "వచ్చే సోమవారం నాడు కూచుందాం" అన్నాడు.

అలాంటి సోమవారం వాయిదాలు ఏడెనిమిది గడిచాయి. అలా వాయిదాలు పడడంతో మరో వేపున ఇద్దరిమధ్య అదో రకమైన మబ్బు తెరలు కమ్ముతూనే ఉన్నాయి. వ్యవసాయం పనులు వెలవెల పోతున్నాయి. ఎక్కడా చురుకుదనం లేదు. రాజయ్యకి లౌకవ్యవహారాలతో తీరిక లేదు.

ఇవాళ మధ్యాహ్నం ఏదో వొకటి తేల్చుకుందామని గంగన్న నిర్ణయించుకున్నాడు. అందుకే ఉదయంనించీ ఇంటికి పోకుండా కూచున్నాడు.

"గంగన్నా! నువ్వు పనిమానేస్తానంటే నా అభ్యంతరం ఏమీ లేదు. నీ కివ్వవలసిందేదో కరణంగారు లెక్కలు రాసి ఉంచారు. ఆ ప్రకారం, లెక్కలు చూచుకుని పట్టుకుని పో!" అన్నాడు యజమాని రాజయ్య.

గంగన్న "మరి, పొలం తాలూకు కాగితాలు...?" అనడిగాడు. రాజయ్య ఒక్కసారి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ— "ఏ పొలం?" అన్నాడు.

గంగన్న: "గంగరావి చెట్ల పొలం విషయం"

"అది నా పేరనే రాయించుకున్నాను"

"అదేమిటి?" అన్నాడు గంగన్న."

"అం ఏమీ లేదు. ధరలు పడిపోతున్నాయ్. అంచేత, అది నీ పేరనే కొంటే... తీరా ధరలు పడిపోతే, నువ్వు చింతిస్తావు. అంచేత ...!" అన్నాడు రాజయ్య. రాజయ్యకి లోకానుభవం చాలా హెచ్చు ఉండాలి.

"అదేమిటి రాజయ్యా!"— చిన్నతనంలో పిలిచినట్లు పిలిచి, వెంటనే నాలిక్కొరుక్కున్నాడు గంగన్న. రాజయ్య అదో రకంగా చూశాడు గంగన్నని. మాట తప్పాయించుకుని గంగన్న మళ్లీ అన్నాడు.

"అయ్య బాబు, రాజయ్యా! ఆఖరికి ఇదా బాబు? ఆ పొలం నాదని ఎంతో మురిసిపోతున్నాను. అది నా కోసమే కదా నేను శేకం ఫైసలా చేసింది. కాగితాలు కదుముతూ అంతా నా పేరనే రాయిస్తున్నారని అనుకున్నాను..."

రాజయ్య సంభాషణ పెంచటానికి నొచ్చుకు పెట్టు లేదు.

"దాన్ని గురించి నువ్వు పెనుగులాడినందువల్ల ఏమీ లాభం లేదు. ఉన్నదీ, ఇచ్చిందీ పుచ్చుకోవడం మేలు..." అన్నాడు.

రెండు తాచుపాములు ఒకదాన్నొకటి పెనగబడితే, ఎక్కువ సమయాన్ని వ్యర్థం చెయ్యవు. అలానే రాజయ్య గంగన్నల మధ్య సంభాషణ ఎక్కువకాలం పట్టలేదు.

గంగన్న ముక్కుగోళ్లు అదురుతున్నాయి. కళ్లు ఎర్రబడుతున్నాయి. ఎక్కడో అభిమానం పొంగి కళ్లల్లోంచి దూకుతోంది.

"ఇవ్వాళ్టి నించీ కనిపెట్టుకుని కంటికి రెప్పలా చూసినందుకు ఇదా ఫలితం?"









# మొదటి నెల

శ్రీ పోలవరపు శ్రీహరిరావు

తన తాత ముత్తాతలకి కితంనుంచీ పెరుగుతావొచ్చిన పరువూ, పెతిష్టా పచ్చికుండలాగా బద్దలై పోయినయ్. కలలో కూడా అనుకోని అభాసు జరిగింది. ఇక ముందేం జరుగుతుందోననేది ఏదీ గుర్తుకు రావటంలేదు. కనకనే, లోకపు బండినడక ఆగిపోయినట్టయింది. కడుపు చెరువై పోయింది. ముడతలడిన దవళ్ళమీదగా జారే కన్నీళ్ళను తుడుచుకోవాలనే ఓపికూడా లేనట్టు—గుండెలు చదికిలబడి పోయినయ్.

ఈ సందెచీకట్లో జరిగిందంతా నిజంగానే జరిగిందా, లేకపోతే కలా అనికూడా తర్కించుకున్నాడు. అంతనుమానం ఎందుకొచ్చిందంటే—ఆ పొద్దుగుంకేయేల తోటనుంచి వచ్చేటప్పుడుకూడా తన గుండెల్లో సంతోసం గంతులేసింది. తనపక్కనే నడిశే చిట్టి వుశారూ, దాని తల్లో బంతిపూల సొగసూ, సన్నగాలికి రెపరెలాడతాండదాని పరికిణీ తీరూ, గిత్తలప మువ్వలసందడీ; పడమటి కొండసాటుకి పోతుండ సూరయ్యతండి పచ్చని జనపచేలమీద జల్లిన కుంకపు రంగూ — అన్నీ తనగుండెల్లో రాగాలు తీస్తాండట్టే వుంది.

అందుకనే పొలిమేర పోరంబోకలో పేడేసుకొస్తాండ సుబ్బి "రంగయ్యదొరగోరియ్యాలకొత్తల్లుడికి మల్లే కులుకుతుండారే" అంది. సుబ్బి ఎంతో ఏపుగా పెరిగిన గిత్తలాగా, నల్లరేగడిమట్టిలాగా నిగనిగలాడతా వుంటది. దానిమాటే ఎకశెక్కాలుగా కవ్విత్తంది. సుబ్బి శెమత్కారానికి సమాదానం శెప్పగల శూరుడీవూళ్ళో లేడు. కాని, తనుమాత్రం భలే జబాబు యిశిరాడు! మీసంమీద శెయ్యేశి, "నీమొగుడే ననుకున్నావా యేంటే — కొత్తల్లుడులాగుండేదీ? మనం యెప్పుడూ కొత్తల్లుళ్ళమే"ననేశాడు. సుబ్బి కిలకిలా నవ్వింది. అది నవ్వినప్పుడు దాని పళ్ళు—మబ్బులో మెరుపు మెరిశినట్టుంటయ్. "మనవల్నెత్తుకున్నా — మాటకారితనం పోలేదే!" అంది సుబ్బి. తను "మాటలే కాదేవ్—యింకా వుంది మన బిస......రంగయ్యంటే యీ కాలపు పిదప మడిశనుకున్నావా యేంటి?!" అని వాత బెట్టాడు. "అబ్బబ్బో! శానాదాకుండదే-యవారం!!" అనుకుంటా యెల్లిపోయింది సుబ్బి. తనుగిత్తల్నదిలిచ్చాడు—ముందుకి.

అంతగాక — తన కప్పుడుదాకా యేం దిగులేడిశిందీ? కనుచూపుమేరలో సంతోసం దప్ప యిశారమే లేదయ్యె. ఆ మద్దినేల గారెలొండుతా, తన యింటిది అంది కూడాను—"ఈ పంటలతో అప్పులు తీరిశేశారుగా—వొచ్చేసాలునుంచీ నిలవేగందా—మనకేంలోటూ!......చిట్టి పెద్దదయ్యేదాకా కానీ కరుచు లేదయ్యె. కొత్తల్లుడంత ముచ్చటపడి అడిగినందుకు—పెద్దపండక్కి, గడేరం కొనిపెట్టలేమా—ముట్టే!...ఒకొండెక్కడన్నా దెచ్చి, కొనిపెడతామని చెప్పిరండీ"అని. ఈ రెండో కూతురు పెళ్ళికే శానా కర్చయింది; 'యిపుడీ గడియారం కర్చొకటా' అనుకున్నాడుగాని—యింటిదానిమాటలే సెబద్ది అనిపిచ్చినయ్.

నాలుగుజోళ్ళ గారెలు తినెల్లి, అల్లుడితో "ఒకొందపెట్టిగడియారం కొనిత్తాంలే—లేచి త్తానం చెయ్యబ్బాయ్" అన్నాడు. అందాకా, ముకం కంపగడ్డకి మల్లే పెట్టుకుపడుకున్న మడిశి, ఆమాట నేతలికి ఏనుగంత బలంతో లేశి, తుండుగుడ్డ కట్టుకుని, పందిట్లో కెల్లాడు. అలిగి కూచున్న అల్లుడెల్లి, ఎత్తు పీటమీద కూచ్చుని, మంగలాడితో నూనె రాయించుకుని, నలుగు పెట్టించుకుంటాంటే — అప్పుడుదాకా మునమునలాడిన చిన్నకూతురు ముకం ఎట్టా ఎలిగింది! కిటికీలొంచి తొంగిసూశి, ఎంత సంబరాలు పడతా లోపలికి తుర్రుమంది!! అప్పుడు తనగుండె లెంత తేలిక పడినయ్! ఆ వుశారులో అరుగెక్కి, చూర్లో పుగాకు పట్టాతీసి, నాలుగుపాయలుచుట్టి బొడ్లో దోపుకుని—అడక్కుండానే మంగలాడికి రొండు తునకలు పారేశాడు.

అప్పుడేగా — చిట్టి పసుపూ, కుంకం కలిపిన నీళ్లు తెచ్చి అల్లుడు నెత్తిమీద బోశిందీ! పాపం-ఆ కుర్రాడు తన పులేసం చూసుకుని — కాసంత ముకం చేసుకుంటే — చిట్టీ బుడ్డాడూ లీల్లాయి పదాలు పాడతా గంతులేశారు. "బావ పెద్దపులేసం యేశాడే" అని చిట్టీ; "కొత్తోడినా, యింకా పసుపూకుంకం కావాలా?" అని బుడ్డాడూ ఒకటే గోల. అల్లుడేమో "నన్నునీళ్ళోసుకు రానియ్యండి—మీ పెళ్ళి జేస్తాను" అని గద్దించినకొంది—పిల్లల సరసాలెక్కువయినయ్. ఆళ్ళ ముచ్చట్లు జూస్తాంటే తన పెళ్ళినాడు—బామ్మరుదుల మీద తను జల్లిన గులాం పొట్టాలూ, మరదళ్ళని పట్టుకుని బలవంతంగా రాశిన మశీ, సున్నబొట్లూ గుర్తుకొచ్చినయ్.

ఆ సంతోసంతోనే అడుక్కొవచ్చిన మాలదాసరికి చేటెడు కొత్తోడ్లు పెట్టించాడు, చిట్టితో. అంత కుశాలుగా వుండబట్టే చావిట్లో గిత్తల్నిప్పి నాగలి గడుతున్న పాలేరుకి రూపాయిడబ్బులిచ్చి "కోడిపందేలకెల్రా" అని పంపిచ్చాడు. బుడ్డాడుకూడా, "కోడిపందేలదగ్గిర కెల్తా, పావలా యివ్వంటే" అంటే అద్దరూపాయ్ బిళ్లిచ్చి పంపిచ్చాడు. తనే నాగలిగట్టుకుని తోటకి తోలుకెలాడు.

అపుడన్నా ఆ రామలచ్మలకి యింత గతి పడతందని యీసమెత్తుకూడా అనుకోలేదు...తన గిత్తలెంత దీటుగా వుండేయి! ఏడుజానల పొడుగూ, ఆరుజాన లెత్తూ, నాలుగుజానల యెడల్పూ, పిడికెడెత్తున కండా, రొండు పిడికిళ్ళకి మించి మోపరాలూ; గిన్నెకొమ్ములూ; దోరబట్టలూ—అంతా కవలల్లాగా, నిండుగా వుండేయి. ఊళ్ళోవోళ్ళంతా "రంగయ్యగారి గిత్తలు—దేవుడి నందుల్రా" అనే వోళ్ళు. రొండూ కలిసికట్టుగా ఆ అర్రు లొంచటం, ఆ తలలూపటం—జమీందారుల అల్లుళ్ళ నడకలాగా వుండేది. రొండూ తన అత్తారు అరణం యిచ్చిన కపిలావుకు మనవళ్ళు; అప్పా చెల్లెళ్ళ బిడ్డలు. రొంటికీ మద్దన కారూ, కొర్రున్నర తేడావున్నా—ఏది రాముడో, ఏది లచ్మడో బైటాళ్ళు చెప్పుకోలేక బోల్తా యేశేవారు. తన కూడా ఏది ఎలపదో, ఏది దాపటిదో మరుపొచ్చేది. అటు దిటూ, యిటు దటూ కట్టబోయే సరికి—అయి కాడికింద కాశేయి కాదు. అప్పడాటి



పగ్గాలు వొదిత్తే, ఆటంతటయ్యే మారి, కాడికింద కాసుకు నేయి

అంత బుద్దిగలయ్ గనక నే బుడ్డోడు బండిముందు నుంచుని పోలు జాపించినా — ఆటంతటయ్యే వొచ్చి బండెత్తుకోబోయేయి. ఆకరికి ఆడపిల్లలు బొమ్మలు చ్చు కాడిచ్చినా—బుస్సుమన్న పాపాన పోలేదు అందుకనే, తనూ పెద్దకొడుకు భీముడూ యింటికాడ లేకపోయినా చిట్టమ్మే గిత్తల్నిప్పి, చెర్లో నీళ్ళెట్టుకొచ్చి కట్టేశేది.

ఆటికి మాటలాట్ట మెక్కట్టే రాదు గాని—మనుసుల కున్నంత ఊహావుంటేది తెరింటో వాళ్ళ ఆ లో శ న ల్ని పసిగట్టి నట్టుగా నడుసుకు నేయి రొండో కొడుకు సచ్చిపోయినపుడు, తమతోపాటు అయ్యావచ్చి మంచినీళ్ళన్నా పుచ్చుకోలేదు, కళ్ళమ్మట నీళ్ళు గారుస్తా, యీగల్నన్నా తోలుకోకండా అవజానే నుంచుండయ్.

అంత బుదిగలయ్ గనక నే ఆ మద్దినేల, నాగలిగట్టి తోటకి తోలుకెలతా — నడి బజార్లో దొమ్మరి గడాట నూత్తా నుంచుంటే—ఆటంతటయి చెరువు కెంగని నీళ్ళుదాగి, గట్టెక్కి, చెట్టు నీడని నుంచున్నయ్. తనేమో బొమ్మరిసాని గెడెక్కటం సూత్తున్నాడు. దాం తస్సాదియ్యా—ఎంత గుండె నిబ్బరమో, ఆ ఆడదానికి— నేలమీద అనకుండా, మొగాడు నడుంకి కట్టుకున్న పదిబార్ల గెడక్రాసులు నూత్రంగా యెక్కేసింది! ఆ పైనెక్కి ఎన్ని పల్టీలు జేసింది!! పక్కన నుంచుని ఒకడు డోలు ధలే బజాయిచ్చాడు. అందరూ చప్పట్లుకొట్టారు గెడమీదక్కన దొమ్మరసాని—ఝుయ్యిన కిందకి దూకింది. తన గుండెలు అదిరిపోయినయ్ అది గెడమీంచి జారిపడిపోతాంది గావల్ననుకుని "అరెరెరే!" అని అరిశాడు కూడా. ఆ మొగాళ్ళిద్దరూ పెద్ద దుప్పటి సుడ్డని, చెరో యేపునా బట్టుకుంటే—దాంట్లోకి దూకిందా ఆడది. పడిం దల్లా లేశి నవ్వుతా దణ్ణాలు పెట్టిందందరికీ. దాని దయిర్యానికి మెచ్చుకోని, తను—ఆ మొగాడితో "ఆ జోరేప శెట్టు కనిపించే, నాలుగు దూలాల పెంకుటింటికెల్లి—నే జెప్పానని జెప్పి, కుంచె డొడ్లు దెచ్చుకోరా" అని చెప్పేశాడు ఇక — నాగలిగుర్తు కొచ్చి చూత్తే, గిత్తలు చెట్టుకింద నుంచుని నెమరేత్తున్నయ్.

తను చకచకా యెల్లి ఆటిని డొంకకి మలిపాడు ఆ రామలచ్చుమ్మల్ని తలచుకుంటే—అయి జేసిన పెతీ పని, పుప్పుడే, తన కళ్ళముందు మల్లీ జరుగుతాంటట్టే వుంటంది. ఇయ్యాల మట్టుకి యియ్యాల డొంకంటెల్తాంటే ఏం జరిగింది!! డొంకకి రొండు పక్కలా వున్న తోటల్లో మామిడిపూతా, జిడిమామిడి కాయల దోరరంగూ తననీ, రామలచ్చుమ్మల దీటునీ జూశి మెచ్చుకుంటా డ్డటుగున్నయ్. తను ములు

# మెతకనేల

గ్రతో రెండు జీడిమామిడికాయలు రాల్చి, ఏరి, నోట్లో యేసుకుని, సప్పరిచ్చి, రసం మింగి, పిప్పి వూశేశాడు. 'అంతెందంగా వుండే పళ్ళు, యింత వసగా వుంటయ్యేటో' అనిపిచ్చింది ఈలోపల గిత్తలు ఖడేరావ్‌గా నిలిశిపోయినయ్. తను అదిలించినా కదల్లేదు ముట్టె యెనక్కి దిప్పి "మాకేమీ పెట్టవేం" అన్నట్టు జూశినయ్ పిల్లలు మారాం జేశినట్టు "ఊ( —— —" అన్నయ్.

తన కాటి మాటల్తెలుసు గనక — డొంక పక్కన కోరడిమీద పెరిగిన గడ్డి కాస్త పీకి, రెంటికీ పెట్టాడు. అయినముల్లా తోట్లోకి నడిశినయ్. అక్కడ కోశేరిప్పి, పగ్గం పన్ని, దున్నటాని కమిర్చి, యెనక్కెల్లి, మేడిబట్టి అదిలించేసరికి — పొద్దుట దున్ని వొదిలిన కొండ్రలోకి దిగి, కొత్త చాలుకు తిరిగినయ్. ఆగి తలతో ఎంతపని జేసినా శేశినట్టే వుండేదికాదు. మనిశి మనుసులోని మాటలన్నీ గాయించినట్టు, పగ్గపు సైగలకే కొండ్ర కలిపేయ్.

ఈయేడు సంకురాత్రికి ముందలే పప్పునూరిపిళ్ళుముగిం చెయ్యాలనే పట్టుదలతో భీమయ్య యీతోట దున్నటం అపిచ్చాడు మరి—పండక్కి ముందే మాసూలైపోతేగాని, అత్తారింటికెల్లి పదిరోజులుంటాకి యీలుండదనుకున్నాడు గావల్ను—పిచ్చి సన్నాశి! కోతలు కాంగానే పెరటి దొడ్డిలో గుంటలు వూడపాలిపొచ్చిందిగాని — లేకపోతే కిసిమిస్ పండక్కి యీ తోట దున్నాలిశింది. ఇరవై రోజులాలిశ్మమయ్యేసరికి, యీ బుసక నేలా గిడసబారింది చాలు లోతుగా బడితేనేగాని పదును కొచ్చేటట్టు కనబడలేదు

ఎడంచేత్తో మేడి అదింపట్టి "ఊ" అని ఎడ్డ వదిలిచ్చాడు. గిత్తలు అ(రులాంచి బలంగా పట్టి లాగినయ్. చాలు బాగా, పాతికపై చిల్ల లోతుగా, పరపరా తెగుతాంది. ముక్కుకు సూటిగా, యేలెడు వొంకన్నా లేకుండా అద్దరికి ఎల్లింది. ఇక నాలుగు చాళ్ళతో యీ కొండ్ర కలిశిపోతంది గనక కొత్త కొండ్ర యేత్తేనేగాని ఎద్దు తిరగే యీలుండదు. గిత్తలు ముందు కోరడి మీద ముందు కాళ్ళేశ్టట్టు ఎగదోలి, దాపడిదాని పగ్గం లాగి, యెలపడదాన్ని "అహో(య్ అహో( హో(య్" అని అదిలిచ్చాడు అది కోరడి అంచునే తిరిగి, నాలుగు బారలు నడిశే తలికి; మళ్లీ దాపడిదాని పగ్గం లాగి, యెలపడదాన్ని అదిలిచ్చాగు అది కొత్త కొండ్రకి తిరిగింది. దాపడదాని పగ్గం వొదిలేశి, "భో భో .. అహో(య్" అని రెంటినీ అదిలించి మేడి అదింపట్టాడు. కొత్తకొండ్ర కిందటి దానికంటే బాగా తెగుతాంది. నాగలిదుంప,



"డూ డూ బసవన్నా!"

ఏ. వి. యస్. ఆర్. జోస్యులు

పెద్ద కాలవలో పడవను కొన్ని లాగా నడుస్తోంది.

దాని శిగ దరగా—కొండ్ర సగబడి గొల్లె తలికి, నాగలిదుంప గతుక్కున యేడి కోలకంటా విగడిపోయింది. ఛన్—మేదక నేల!! మేడి అందకుండా భూమిదగ్గర కెళ్లిపోయి నట్టయింది. గిత్తలు అగ్రగాలాంచి, అంత పెద్దా లాగిపారేయ్యాలనే పట్టు బట్టినయ్. తనే, అంతవస్తైందుకని "హాహో హూ... హో హో" మని అపాడు. ములుగ్ర మొదల్తో, దుంపమీదట్టిన మెండు చెక్కని పక్కకి నెట్టి, మేడిని బలంగా పట్టి, నాగలంతా ఎత్తి పక్కని బెట్టాడు. ఈ నేల కొస్త బలువూ, సులువూకూడా నోపలేదని, మేడి అలాగ్గా పట్టి-గిత్తల్నదిలిచ్చాడు. మళ్లీ కొండ్ర కలిపాడు.

పొద్దింకా బారెడుందనగా చిట్టొచ్చింది. చేబుట్టనిండా బంతిపూలు కోసుకుని, "సంపెంగపూలు కోసియ్యవంటే నాన్నా?" అని అడిగింది. "ఎల్లేటప్పుడు కోసిత్తాగానీ, దొరువు దగ్గిర కూచో చిట్టీ" అని తను చెప్పాడు. కాని, అది ఎల్లకుండా నాగలెంబడే నడుస్తా—"మల్లయ్యగారి తోట్లోకి మల్లే, మన తోట్లో మామిడిచెట్టు లేవేం నాన్నా" అని అడిగింది తను—"ముసలయ్యయిపోతే అప్పుడప్పుడూ కొట్టేశాం మనతోట్లో శెట్లు... మళ్లీ కాలం బాగుంటే వచ్చే యేడు అంటు తెచ్చెయ్యాలి!" అని చెప్పాడు.

చిట్టి నోరెప్పుడూ ఏదో ఒకటి అడుగుతా వుండాలిసిందే. అదేమిటీ, యిదేమిటీ అని దుంపతెంపుతుంది. "ఇప్పుడెందుట్లో ఏం జల్లుతారే?" అని అడిగింది. "గొడ్డకీయేడు జనుమన్నా జల్లలేదు. ఉలవ కాడన్నా వుంటేగాని గొడ్డు చిక్కుండా వుండవు... కనుంపండగెళ్లాక ఉలవలే జల్లాలి" అని తను జెప్పాడు... కొండ్ర కలిశాక ఎడ్లనిప్పి, రామలచ్చుర్లి దొరువులో నీళ్లెట్టుకు రమ్మని చిట్టికి పురమాయించి, తను నాగలికి కోటేరేశాడు. గిత్తలు నీరు తాగొచ్చి, కాడికింద కూశినయ్. వాటికి కాడితాళ్లుకట్టి, పడమటి కొరడిమీద గరికుంటే అటునోలి—తను సంపెంగ చెట్టు కాడికెళ్లాడు.

దాన్ని తన పెళ్ళప్పుడెప్పుడో అంటు తెచ్చి నాటాడు తన బాబు... ఈ చుట్టు పక్కలూళ్ళలో యింకెక్కడా సంపెంగ చెట్టు లేదు. ఇదైనా రోజుకు రెండో మూడో పూలు యిస్తుంది. అయితే మాత్రమేం, పైరగాలి కొటవాసన పూళ్ళోక్కూడా పోతుంది. అంత సువాసనగల పూలు గనకనే ఆ చెట్టుకాడ నాగుబాములు పుట్టవుంది. అందుకనే యెవరూ ఆ చెట్టు పాయలకి యెళ్లరు. తనకు మాత్రం నదురూ బెదురూ లేదు. నాలుగయిదు దఫాలు ఆ నల్లతామా, తెల్లతామా కనపడినయ్ గాని—ఆటిని మూడగానే తను తలగుడ్డతీసి, రెండుచేతులూ యెత్తి "నాగుమయ్యలూ, మీ బిడ్డలం—రచ్చించాలి... చయితి, నయితికి మీ పుట్టలో పాలోత్తాం" అని దణ్ణం పెట్టేవాడు, అయి—గర్బాన బడే మారయ్య తండికి—పడగలిప్పి దణ్ణాలు పెట్టి, సల్లగా కలుగుల్లోకి యెల్లిపోయేయి. అందుకనే తన కంత బక్తి—అయింతే.

ఆకుల్లో రంగు కలిశిపోయుంటే సంపెంగ పూలు కనుక్కోటం మా చెడ్డకష్టం.

అయినా తన కలవాటే గనక యింకా నాలుగు పూలు కోశాడు... ఇంకా కోశ కొచ్చే పూలు నాలుక్కూ విచ్చినయ్. పండక్కి కూతుళ్ళిద్దరూ పెట్టుకుంటార్లే, రేపు కోసుకెళ్లాం అని అటే వొది లేశాడు... ఆటినింకెవళ్ళు కోస్తారు?!

తనింటో వాళ్ళింకా ఏ మూకాల్లో పెద్ద పండగ జేసుకుంటారూ? కొంత సుగ్గి మైనాక—పూలూ, పండగలూ ఎవరి కావాలి — ఏడుపులూ, మొత్తుకోళ్ళూ నైతే!? అప్పుడుదాకా అంతా ఎంతో కుశాలుగా వుండగా—అంతట్లోనే యింత అభాసు జరగటం తలుసుకుంటే గుండె శెరువై పోతోంది... బొద్దు కొట్టుకుంటు ఉబుకుతోంది దిగులు... వొళ్లంతా వణికి పోతాంటే తనని తనే మాసుకున్నాడు.

తనకి సొక్కా యేసుకునే అలవాటే లేదు. వల్లెవాటు పంచి సగం సగం తడిశిపోయింది—తన కళ్ళమ్మట కారే నీళ్ళ గావల్ను. అసలే సంకురాత్రి చలి; నెత్తిమీద రాయాకుల్నించి మంచుబిందువులు పడుతుంటాయ్. ఇక్కడంటే సాగిపోతాంది పొలిమేర కాలవమీంచి చలిగాలొత్తాంది. పెనాకానికి అంచులగిలి గావల్నా! కళ్ళు గలగల్లాడ తన్నయ్. అద్దరినుండి తుమ్మల బీట్లో గుడ్డగూబ లరత్తాండెయ్. ఇటు పొలాలమీద నక్కలరొదు. చుట్టూ బయ్యంగరంగా వుంది... ఇలకోళ్ళూ, కీసురాళ్ళూ తెరిపిలేకండా పాడుతాండెయ్. [illegible]రులో గావల్నా—అప్పుడే [illegible] బజనచేస్తూ మేలుకొలుపులు మొదలెట్టారు.

తనెంత వొంటిగావుండా సగం దెయ్





# మెతకనేల



రక్తంగా వుండేది శేతిలో కఱ్ఱ. చలికి శేతులు కొంకర్లుబోయి గావాల్ను — ఆ కఱ్ఱ జారి కిందబడిపోయింది. దాన్నందుకుని గట్టిగా పుచ్చుకుని, రాయిశెట్టు మీద ల్నానుకున్నాడు. గుండెల్లో బాధ గారతాండట్టుగా వుంది... ఏం జెయ్యాల్లో తోసటం లేదు ... ఎంతసేపూ — సందకాడ జరిగిన అభాసుపంగతే గుండెల్లో కెలకేత్తాంది. జరిగినియ్యాన్నీ తన కళ్ళముందు సినిమాబొమ్మలకిమల్లే జరిగిపోతాండట్టు అవుతాంది.... సాశేపు — నిజంగా యీ అభాసంతా జరిగిందా, లేకపోతే కలగంటన్నానా అనుకున్నాడు ... ఇప్పుడే చలి; పొలిమేరదగ్గర యియ్యాల్రమా, మినుకు మినుకుమనే సుక్కలూ; యీ రాయిశెట్టు కింద తను ఒంట్రిగా కూకోటమూ — యియ్యన్నీ జరిగిన యిశేసాలు, కల్లో గాదని అనిపిచ్చింది.

జరిగినియ్యన్నీ అబద్దమయితే — తనిట్టా, యిల్లిడిశి, ఒంట్రిగా, యిక్కడ వుండకుండేవోడూ? జరిగిన అభాసుకు యింటిల్లిపాదీ, గొల్లుమని యేడుత్తాంటే, గుండెల్లో రెవళ్ళో సెయ్యెట్టి దేవినట్టయి, నడితలో బద్దలికలాగా అయిపోయి, నడిబజార్లో మానబంగమయినట్టనిపిచ్చి — ఆ వజాన శేతి కఱ్ఱబుచ్చుకుని, సెప్పులిన్నా తొడుక్కోకుండా, కాళ్ళు వడిశినట్లు వొచ్చేశాడు గందా—తను?!

ఏనేం పాపంజేశాడని యింత జరిగింది? ఏనాడూ ఒకళ్ళ సున్నపాకుతో డింకన్నా తను ఆశపడలేదే? పరాయాళ్ళ గడ్డిపరకన్నా తన కంటుకుంటే 'యిసం' అనుకునేవాడే! తన కున్నదాంట్లోది ఒకళ్ళ కింత బెట్టాలేగాని — ఒకళ్ళకి శెయిజాపి యెరగడే ... మరి, ఆ బగమంతుడెందు కిట్టా తన నబాసుజేశాడూ?! ఏ మొక్కులూ శెల్లించకుండా దిగద్స్ లేదే తను! ఆఖరికి— గనిదెగెబ యీనినప్పుడుకూడా, యింటి దానితో—గంగానమ్మతల్లికి—చద్ది పొరేణం బెట్టిన్నాడే!

తనది యీనమొత్తు దోసం లేకపోయినా— ఆ శంకరయ్యకెందు కింత కచ్చ? తనొకరి జోలికి, సొంటికి పోయేవాడు కాడుగందా; వూళ్ళో ఎవరేగొడవలుపడ్డా, తను జోక్యం పుచ్చుకునేవాడు కాడు గందా; అయినా, ఆ ముటావోళ్ళు తనమీద యింత పాపబ్బుండి తోలాల్సిన జరుగూ రేమొచ్చింది? తను ఎవర ముటావాడా అంటే — తను ఏ ముటా యిశేసాల్లోనూ వేలుబెట్టి యెరగడయ్యె!!

ఆమాటే తను శంకరయ్య నడిగాడు కూడాను. అడిగితే, ఆయన "అందుకనే నోయ్...గోడమీదపిల్లి వాటంగా వుండేవాళ్ళంటే నాకు మంట" అన్నాడు — మొకం ఆముదం తాగినోడికిమల్లే పెట్టి. ఆయన సెప్పిందేమిటో తనకి తెలిసేదవలేదు. శంకరయ్యంటే పదుపుకున్నోడూ; పెద్దముటా కిచేరూ గనక, అనేక తికమక లెట్టేమాటలాడ్చును గాని — యీదిబళ్ళో సంతకం బెట్టటం మాత్రమే అబ్బిన తనకేం దెలుస్తా?!

ఇదవమంటే పాము కోపం, కరవమంటే కప్పకోపం గనకా;—తిన మున్ను తను పిసుక్కుని, తన బతుకు తను బతికేది గాని, ఒకరితో కెలుకులాట తన కెందుకనీ; — తను ఏ ముటాలోనూ జేరలేదు. దాని కిగదరగా—అదీ తప్పేనా? ... తప్పేనన్నట్టు మాట్టాడా జేమిటి శంకరయ్య? తను ఏ ముటాలోనూ జేరకుండా, తన మానాన తను బతుకుతుండందుకేనా — యింతటి అభాసుపాలుజేశిందినీ?

వుత్తిపున్నెనికే యింత అన్నేయమా? తనేమన్నా తెప్పుచున్నాడా, తిన్నాడా— ఆ జోగయ్యదగ్గర? ఏమీ యెరగడు. మొనమొను యెంకటపతి, పెద్దకొడుకు పత్తెం పెళ్ళికి—ఆ జోగయ్యదగ్గర రొండొందలప్పుజేశి నోటు రాశాడు. అది తెల్లగట్టలేక మళ్ళీ మూడేళ్ళకి — కుంటపొలం కుదవబెట్టాడు. ఆ కుదవ దత్తావేజుమీదగావల్ను తను సంతకం జేశాడు — అందుకా, యింత పాపం!

అప్పుచెచ్చుకున్న యెంకటపతిమామ, తీరచకుండా పత్తేమాత్రం — పెళ్ళిజేసుకున్న సత్తిగాడు తీరపొద్దూ? ... పైగా పొలమూ, పుట్రా మేసేరు పిల్లలపేరూ, పెళ్ళాంపేరూ బెట్టి కాళ్ళారజాపొడంట— వాడోళ్ళి యెదవంటూ, యెదవ!!......



అయితే; ఆడు కౌళ్ళారబాపితే—మద్దిన తన మీద అప్పుజేసి, అభాసుపాలు జెయ్యడ మేంబసబూ అంట?

తనేమో, మామ బాకీవుంది నిజంగందా అనే దీమాతో సంతకం బెడితే — అది ఆమీ పత్రరం అంటారేంటీ? తనతో ఆయాల జోగయ్యెట్టాగని శెప్పనేలేదు. సాచ్చి సంతకంగందా అనుకున్నాడు తను...... అంతేగాని, ఆమీవుంటానికి తనకేం జరుగురూ?...ఒకేల ఆమీపత్రరమయితేమట్టుకు అశ్లేనెళ్ళో తెచ్చుకుతిన్నందుకు—తనమీద వొసూల్జేసుకోమని ఆ జడిజీగోరుమాత్రం ఎట్టా నాయం జెప్పాడూ? ఇదేం నాయం—అన్నేయంగానీ?

ఆ జోగయ్యగాడొచ్చినా, నాలుగూ జాడించేవాడు తను. ఆడిపత్రరం యీ శంకరయ్య ఆడ్డరేయించుకున్నాడంట — అందుకని మాటమాత్రమన్నా శెప్పకండా, శెయ్యకండా— జబుతువోరంటట్టుకురావటమా? తోటిరైతునని, ఒక్కసారన్నా, యిదీ సంగతని, కబురన్నా పెడితే యేంబోయిందీతంది? సన్నెదో తలగొట్టి, మొలవేద్దామనే శంకరయ్యెట్టా అమీనాతోకూడా వొచ్చాడు...పెద్దపండగేల—అల్లుడింట్లో వుండగా — నన్నింత అభాసు చెయటానికి, జేసిన తప్పేం జచ్చిందో—బొత్తిగా తెలివిడి కావటంలేదు.

తెలుసుకుంటే ఎందుకన్నా మంచిదని ఎన్నిసార్లడిగినా — "మరేం టనుకున్నావ్ రంగయ్యా!...శంకరయ్యంటే మాట లేనను కున్నావ్ గా! హ్హుం...... అందుకేగా, నా పార్టీలో జేరమని ఎన్నిసార్లు కబురంపినా జేరలేదూ?" అని కోకొయించాడు —శంకరయ్య. తను "నా కేమిటా లెందు కండీ... నేను మీ ఎదిరి ముటాలోకూడా శేరలేదుగా...... నేనే దోసమూ ఎరగనే" అని కలకచేటుకి మనవి శేసుకున్నట్టు చెప్పాడు.

శంకరయ్య: "ఏమీ యెరగవేం? రెండాపుల దూడలాగా యింతకాలమూ కలాయించావుగాని — మొన్న పంచాయితీ బోర్డు ఎలెక్షన్లలో చేతు లెవరికెత్తావో నాకు తెలవదనుకున్నావా? అంతమంది జనంలో నువ్వు గుర్తుండవు లెమ్మనుకునేగా—చిన్నపార్టీవాళ్ళకి చెయ్యెత్తింది? ఇంకేం వాళ్ళెట్టా అడ్డుపడతారో చూస్తాను." అని మీసాలు దువ్వాడు...తను "మా బజార్లో పెద్దతలకాయ గనక, రాజయ్యకే చెయ్యెత్తాను...అదీ తప్పేనా?" అన్నాడు. శంకరయ్య "తప్పా, తప్పున్నరా? నా ఎదిరి పార్టీకి ఓటిచ్చినవాళ్ళంతా నాకు విరోధులే.........ఒక్కొక్కళ్ళనీ శంకరగిరి మాన్యాలు పట్టించకపోతే నాపేరు శంకరయ్యే కాదు" అని రంకె వేశాడు.

ఛా...తనకేమిటీ, యిరోదాలేమిటి? ఒక గట్టు తగదా, పుట్ట తగాదా, పోరసుల్తగాదా, ఏమీ లేదయ్యె? అన్నేయంగా, తనని ఏమీ యిశారించకుండానే, జడిజీగారు యిట్టా అమీనా నెందుకు పంపారో అంతకంటే అంతుపట్టలేదు. అందుకే, అమీనానడిగితే—"మీకు తెలవక పోవట మేమిటండోయ్......ఈ సమన్లు చూడండి — మూడుసార్లు తిరగ్గొడితే, మీ తలుపు కంటిచ్చి వొచ్చినట్టు సర్టిఫికెట్ చూడండి" అని నాలుగైదు కాయితాలు సూపిచ్చాడు. "అయ్యో రామా, నేనే సమనూ ఎరగనే—నాదగ్గర కెవరొచ్చారో పెమాణం చెయ్యమనండి" అన్నాడు తను. శంకరయ్యపక్కనున్న మునసబు "నువ్వు సమన్లు తీసుకోనని బుకాయిస్తేనే — నేనా సర్టిఫికెట్ రాశింది" అని కిసుక్కుననవ్వాడు. "రామ, రామ, యింత అబద్దాలా మునసబుగారూ? పిల్లలు గలోణ్ణి, నే నేనాడూ ఏసమన్లూ సూడలేదే" అని తను లబలబా మొత్తుకుంటే—"ఈ నాటకాల కేం లెండి—ముందు గిత్తల్నిప్పించండి అమీనాగారూ" అని శంకరయ్య గదిమాడు.

లేనిబాకీని వొసూలు జేసేందుకు—యింతమందీ కుమ్మక్కయి, పాపాని కొడిగట్టినప్పుడు తనేం జెయ్యగలడు? దొడ్లో పుట్టి పెరిగి, తన యెవసాయానికేగాక—బాడిగతోలికూడా సంపాయించిపెడతాండ గిత్తల్ని జబుతుజేత్తే తను గతేంగాను? "మా పేణాలకంటే యెక్కువైన రామలచ్మల్ని వొదిలిపెట్టండి—రొండు రోజులు గడువిత్తే — తలన్నా తాకట్టుబెట్టి తెచ్చి మీ డబ్బు గడతాను" అని ఎంత బతిమాలినా యిన్నారా? ఆఘనాన, నాలుగొందలపై చిల్లా కక్కమన్నారు. కొత్తొడ్లలోయి తిండికీ, జీతాలకీ రొండు పుట్టటి పెట్టుకుని—మిగిల్నియ్యమ్మి చిన్నపిల్ల పెళ్ళికి జేసిన అప్పు తీర్చానయ్యె. ఉన్నగింజలన్నీ అమ్మితేనేగాని యీ అన్నేయపు బాకీ తీరదయ్యె. పోనీ, నలుగుర్లోనూ నగుబాటు కాకుండా. అప్పో సప్పో జేసి తెచ్చి కడదామంటే — భోగిపండగనా డెవరప్పు పెడతారూ? అందుకే కనుంపండగల్లేదాకా ఆగితే, డికిలీబాకీ యావత్తూ, అచ్చరసుద్దిగా తెచ్చికడతానని ఎంత ఏడుకున్నా —శంక[illegible] పట్టు వదల్లేదు.

[illegible] పోలి[illegible] యీ గుంపు శింపులు పడతాం[illegible] జయ్యగారి అల్లుడొచ్చి రొంలపలకి తీశకెల్లాడు...అతనెంబడే పక్కబజారులోకెల్తే రాజయ్య, పాతికమంది సాము

(45-వ పేజీ చూడండి)

# మూలిగే నక్కలు

శరభయ్య - కాంతమ్మ
పోతరాజు - ప్రభావతి

(శరభయ్య ఇలు. కాంతమ్మ హాలులో వెనక్కి తిరిగి ఖాళీప్లేట్లు తీస్తుంటుంది. (ప్రవేశం శరభయ్య ముందునుంచి)

శ: (ఉస్సురంటూ గుమ్మంలోంచే) పిల్ల లేరీ. అంతా ఏమయినారూ.

కాం: పెద్దపిల్ల లిద్దరూ నీళ్ళు చేరేస్తున్నారు. పిల్లలు బడిలోంచి రాలేదు.

శ: (దగ్గరికి వచ్చి కాళీప్లేట్లు చూసి చిరాకుగా) మింగ మెతుకులు లేవు మీసాలకి సంపెంగ నూనెలట. తింటానికే నాస్తి అయితే చిరుతిండ్లు కూడానా.

కాం: (వెనక్కి తిరిగి) అమ్మాయిని చూడ్డానికి వచ్చారండీ?

శ: అల్లాగా! మరి నాకు కబురంపావు కాదేమే?

కాం: వాళ్లు అర్జంటుగా ఏదో పని మీద వచ్చారట. అరగంటలోనే పిల్లను చూసి వెళ్ళిపోయారు.

శ: ఎంతమంది వచ్చారేం?

కాం: పెళ్లికొడుకు, అతని పినతండ్రి, మన పోతరాజూ.

శ: పిల్లా డెలాగున్నాడు?

కాం: నిక్షేపంలాగున్నాడు. బాగా చదువుకున్నాడట. కొద్దో గొప్పో ఉన్నవాళ్ళట. పిల్ల మంచివంగడంలో పుట్టిందీ, అందమైనదీ అయితే, కట్నాలూ కానుకలూ విషయాల్లో అంత పట్టింపులుండవట.

శ: వెళ్ళేటప్పు డేమన్నా చెప్పారా.

కాం: లేదండీ. అన్ని సంగతులూ పోతరాజుగారితో కబురంపుతారట.

శ: (ఉస్సురంటూ కుర్చీమీద కూర్చుని) ఏం కబురో ఏమో. 4 ఏళ్లనుంచీ రెండో దానికి సంబంధాలు చూస్తున్నాం. ప్రతి వాళ్ళూ వచ్చి చూసి పోవడమే కాని "ఊ" అని పోరాయె. వచ్చే 80 రూకల్లో ఈ మాపుల గుత్తాల్ని మేపడానికే సగం అయిపోతున్నది.

కాం: పూర్వమే నయమండీ. కతికితే అతకదని ఏదీ ముట్టుకు నేవారు కాదు.

శ: ఇంతకీ పిల్ల నచ్చిందా...

కాం: నచ్చకేం చేస్తుందీ. బంగారపు బొమ్మలాంటిది దానికేం లోటూ.

శ: (నిట్టూర్చి) డబ్బు లోటే పెద్ద లోటు. అదే ఉంటే కన్ను సొట్టయినా, కాలు సొట్టయినా, అప్సరసలూ ఆణి ముత్యాలూలా కనిపిస్తారు వాళ్ల కళ్లకి.

కాం: అందరూ డబ్బుకే ఆశపడితే బీదపిల్లలకి పెళ్ళి ళ్లెలాగవుతాయి.

శ: అవకపోతే కన్నవాళ్లకి కష్టం కాని పెళ్లిమాపులవాళ్లకేం నష్టం.

కాం: ముండా మాపులులే. కూర్చోపెట్టి నిలబెట్టి, నడిపించి, పాడించీ మాట్లాడించీ, అడ్డమైన పరీక్షలూ చేసి ఉన్నంత సేపూ దాన్ని నానాహైరానా పెట్టేస్తారు గదా. మా కాలంనాడు ఈ సోద్యాలెరగం.

శ: (నవ్వి) ఎరుగుంటే నీలాంటి వాళ్లకి పెళ్లయేదా?

కాం: (కోపంతో) అనే వాళ్లు ముందు వాళ్ళ అందచందాలు ఎన్నుకుని మరీ అంటే మంచిది.

శ: భుజాలు తడుముకుంటా వెందుకే. అయినా నీ వన్నమాట నిజమేలే. చూపులకొచ్చేవాళ్లు ముందు వాళ్ల అందచందాలూ తాహతులూ, ఎన్నుకుని పిల్లల్ని శల్యపరీక్ష చేస్తే బాగుండేది. కూటికి గతిలేకపోయినా కోతుల్లాగున్నా, కొండంత కోర్కెలతో వేలానికి నిలబడతా రీ పెండ్లికొడుకులు. ఎవ డెక్కువ పాడితే వాడివైపు మొగ్గుతారు. ఇక మొదలు పిల్లనిచ్చినవాడికి తిరుతువరం. నలుగురాడపిల్లలున్న వాడి కొంప గుండమయినట్టే.

కాం: అలాగని చెయ్యకతప్పుతుందా. ఏదో గంతకితగ్గబొంత.

శ: వెధవబొంతలూ నీవూనూ—అలాగే ముత్యంలాంటిపిల్లకి ఏకోశానా తగనిలేకి వెధవకిచ్చి అంటగట్టావు.

కాం: ఏం. మీ పిల్లకొక పిల్లజమీందారుని తెచ్చి కట్టుకో వద్దన్నానా.

శ: (నిట్టూర్చి) తల్లి లేనిది గదా, అందులో అందరిలో పెద్దదిగదా అని ఉన్న పిత్రార్జితం తెగనమ్మి ఊళ్ళు గాలించాను మంచి సమ్మంధంకోసం. ఎమ్. ఎ. అయితే 80 వేలూ, బియే. అయితే 40, చివరికి స్కూలుఫైనలు కి సార్లుతప్పిన పక్షిగాడికూడా 10 వేలంటే ఎక్కడ తెచ్చేదీ?




కాం: ఈ రోజుల్లో చదువుకున్న వాళ్ళే మరీ మండిపోతున్నారు.

శ: (ఛీత్కారంతో) హృదయమూ, సంస్కారమూ, మానవత్వమూ లేని వీళ్ళ చదువు కాల్చనా — పాపం. పెద్దదాని మొఖం మాస్తే కడుపు చెరువై పోతుంది.

కాం: విధం చెడ్డా ఫలందక్క లేదాయె. భగవంతుడికి ఎప్పుడు దయవస్తుందో.

శ: భగవంతుడు! ఉన్నాడాఅంట!

కాం: అయ్యో బాగుంది. దేవుడే లేకపోతే ఇంత ప్రపంచమూ ఎలానడుస్తుందీ.

శ: ఉంటే గింటే భగవంతుడిది ఒట్టి పక్షపాతబుద్ధి. మూలిగేనక్కలమీదే తాటికాయలుపడేసి తమాషా చూస్తాడు. (ప్రవేశం పోతరాజు.)

పో: మూలిగేనక్క లెవరండోయి!

శ: ఇంకెవరు. ఆవిడొకనక్క. నేనొకటి. మిగతాపిల్లలు.

పో: బావగారు పరిహాసధోరణిలో పడ్డారు.

శ: ఈ పరిహాసం వెనక భగ్గుమండే హృదయం ఉంది.

పో: మనస్సు కుదుట పర్చుకోండి. కష్టాలు కలకాలం ఉంటాయా.

శ: మాయింట్లో కాపరముంటున్నట్టే ఉంది.

పో: చింతలేని మానవు డెక్కడున్నాడండీ. కాలం కర్మం కలిసి రావాలిగాని, అన్నీ సవ్యంగా సమకూడ కేంచేస్తాయి. ఏమమ్మాయి! చెల్లెమ్మా. ఇంతకీ నా గొంతేమన్నా తడుపదల్చుకున్నావా! అలాగే పొమ్మన్నావా. గొంతుక ఆర్చుకపోయేట్టు పెళ్ళివారితో వాదించివచ్చాను.

కాం: సమ్మంధం రైటు చేసుకువస్తే నోటితోపాటు చేయికూడా తడుపుదుంగదా అన్నయ్యా.

పో: నీ సంగతి నేనెరగా అమ్మాయి.

శ: పోయి బావగారికి కాఫీపట్టుకురావే, (కాంతమ్మ వెడుతుంది.) ఏమండీ ఇంతకీ మీరు వెళ్ళినపని కాయా పండా?

పో: ఏంచెప్పను బావగారూ. ముప్పాతిక మూడువీసాలు పండేసమయంలో నడుమంత్రపు వెధవలు అడ్డుపుల్ల వేశారు. వచ్చిగానే రాలిపోయింది.



"నాన్నా ! ఇప్పుడే చెబుతున్నా ! ఇకమీద పెళ్ళిచూపులవాళ్లొస్తే, నే చస్తే కనబడను.
నేను సంతలో గుజ్జాన్నేంకాను అడ్డమైనవాళ్ళూ పరీక్షించికొంటానికి."

శ: (నిట్టూర్చి) ఇదికూడా వట్టిదేనా.

పో: మన రోజుల్లో నూరబద్దాలాడి పెళ్ళిచేయాలనే వారు. ఇప్పుడు నూర బద్ధాలాడి పెళ్ళిపడగొట్టడమే చూస్తారు.

శ: మా కర్మకి ఒకర్నని ఏం లాభం.

పో: ఒక మాటడుగుతా ఏమనుకోరు గదా.

శ: అడుగండి దానికేం.

పో: మీ పెద్దమ్మాయి విషయం.

శ: సరే కానీండి.

పో: ఏమీలేదు. మీరు ఆడపిల్లలు కల వారు. నలుగురిలో వేలెత్తి.

శ: (చురుకుగా) అంత అప్రతిష్ఠపని మా అమ్మాయి ఏం చేసిందీఅంట!

పో: మీ అమ్మాయిసంగతి నాకు తెలి యంచికాదు. కాని లోకులు కాకులండీ బావగారూ! కాకులు.

శ: ఊరి కాకులకోసం నాబిడ్డను గద్ద కప్పజెప్పమంటారా?

పో: మీ మంచికోసం మీ రెండోపిల్ల పెళ్లికోసం. పెద్దమ్మాయి కాపరానికి వెళ్లక విణ్ణర్థనుంచి ఇంట్లోపడి ఉందని నలుగు రమ్మలక్కలూ, అయ్యవార్లూ ఒక్కటే గుసగుస.

శ: నాయింటి విషయం ఒకరికెందుకూ?

పో: అలా అని ఊరుకుంటే బాగానే ఉండేది. వచ్చిన ప్రతి పెళ్లివారితో పరి చయం చేసుకుని ఈమాట కాస్తా ఊది పోతున్నారాయే.

శ: (నిట్టూర్చి) హుం.

పో: పెద్దపిల్ల అలా ఇంటకూర్చున్న ప్పుడు అరక్తం పంచుకుపుట్టిన రెండోది మాత్రం కాపరం మండబెట్టి విడుస్తుందా అని సందేహం కలిగించేట్టుగా—

శ: పాపిష్టివెధవలు.

పో: కాదూ మరి. ఇందుకనే ఇన్నాళ్లూ ఒక్కసమ్మంధం రైటు కాకపోతా. ఇందుకనే ఇవ్వాళ నిశ్చేషంలాంటి సమ్మంధం తప్పింది. ఏదో మీమేలు కోరి చెబుతున్నా. పెద్దమ్మాయిని అత్తవారింటికి పంపకపోతే—

శ: ఎలా పంపేదయ్యా. కున్నంలో ఎముకలేకుండా విరగ్గొడుతుంటేనూ-కట్ట గుడ్డ తినతిండీ పెట్టక చంపుతుంటేనూ.

(60-వ పేజీ చూడండి)

లఘుపతనకుడప్పుడు తన
మూపుపైన హిరణ్యకుని
మెలమెల్లన నెక్కించుకుని
నాకాశ పథానికెగిరె.



కతిపయ దినములకు కాకి
మంథరుడను కూర్మరాజు
నివసించే కొలను చేరి
గట్టుమీద వ్రాలి నిలిచె.



ఎలుకను తన మూపుపైన
ఎక్కించుకు వచ్చిన ఈ
కాకవరో తెలియక తా
బేలు నీటిలోన దాగె



హిరణ్యకుని చెట్టుతొర్ర
లోన చేర్చి లఘుపతనకుడు
గొంతురగా పిలుకొగి:-
"చెలికాడా! మంథరుడా!
ఇన్ని యంఢ్ల పిమ్మట నిను
చూసిన భాగ్య ముదవె నాకు,
ఒకసారిటు రావయ్యా!!"



అని పిలువగ మంథరుడా
గొంతు గుర్తు పట్టినాడు
"ఓహో! లఘుపతనకుడా!
వచ్చిన వాడవు నీవని
ఎరుగక నే నాలస్యిస్తి.
క్షమియించుము స్నేహితుడా!"



ఒకరి నొకరు కౌగలించి
కుశల ప్రశ్నాదికములు
అయిన వెనుక చెట్టు నీడ
చేరి ఖాసీనులైరి



అంతవరకు చెట్టుతొర్ర-లోన వున్న హిర
ణ్యకుడు-వెలికి వచ్చి తాబేలుకు-నమస్కార
మాచరించి-పక్కన కూర్చున్నాడు.



"అవునుగాని చెలికాడా!
వీరెవరో చెప్పలేదు?"

"ఈయన నా ప్రాణానికి-ప్రాణమైన
స్నేహితుడు,-గుణవంతుడు, శాస్త్ర
వేత్త.- ఎంతవారికైన మనసు-
కే కష్టములుంటాయి గదా!-ఈయ
నకూ పాపమేదో-మనోవ్యాధి
పట్టుకుంది.-అందుకనే గాలి
మార్పు-కోసమిటుకు వచ్చినాము"



"ఏమేమో! ఇంత తెలిసి
ఇంత చదివి, జ్ఞానియైన
ఈయనకూ దుఃఖములా?
ఇంతకు ఆ దుఃఖమేమి?"

"మిత్రమా! హిరణ్యకా!
ఇక్కడనైనా నీకొచ్చిన
బాధలేమో చెప్పవోయి"



నిట్టూర్పులు విడిచి విడిచి
హిరణ్యకుడు మెలమెల్లన
ఆత్మగాథ చెప్ప సాగె.



మహిళాపుర దక్షిణ దిశ
నుండెనొక శివాలయము.



ఆ దాపున నొక గుహలో
చూడాకర్ణుడు అనియెడి
సర్వసంగ పరిత్యాగి
సుఖముగ నివసించువాడు




ప్రతి దినమూ జడదారి
మహిళాపురమునకు పోయి
ఇంటింటికీ తిరిగి తిరిగి
బిచ్చమెత్తుకొనే వాడు


తినగా యింకా మిగిలిన
పదార్థాల నొక కుండలో
పెట్టి చిలుక కొయ్యకు తగి
లించి నిద్ర పోవువాడు.


అతడు నిద్ర పోతుండగ
నేను తోటి ఎలుకలతో
వెలికి వచ్చి, పదార్థాలు
కడుపు నిండ ఆరగించి
గర్తున త్రేన్చే వాళ్లం
ఇట్లు కొన్ని నాళ్లు గడువ...


దాచుకున్న పదార్థాలు
దినదినమూ మెక్కు తినుట
కనిపెట్టిన సన్యాసి
మమ్ము పట్టుకోవుటకెన్నో
ప్రయోగాలు చేసి చేసి
విసుగు చెంది వున్నాడు.


ఒకనాడా గుహకు మరొక
సన్యాసి వచ్చినాడు.
అతిథికి చూడాకర్ణుడు
తను తెచ్చిన భిక్షాన్నము
పెట్టి సత్కరించినాడు.


ఆ దినమున రాత్రి పొద్దు-పోవు వరకు యిద్దరునూ
-వేదాంతపు చర్చలలో-మునిగి తేలుతున్నారు, -
జీవాత్మ, పరమాత్మ-సత్యం, చిత్తు, ఆనందం-
మున్నగు విషయాలు చర్చ-చేస్తూ చూడాకర్ణుడు-
మధ్య మధ్య మూషికాల-
నదలిస్తూ వున్నాడు.


"మనసన్న, లేకుండా
మోక్షము పొందాలంటే
కనుగొనవలసినదేమిటి?"
"ఏముందీ, ఎలికలే!"


పరాకుగా యిచ్చిన యీ
సమాధాన మాటను విని
మిత్రునిపై మండిపడెను.


"ఎలుకలందు వేమయ్యా?-చాలు చాలు
కట్టిపెట్టు.-నేనేదో బ్రహ్మపదా-ర్థాన్ని గూర్చి
అడుగు తుంటే-నువ్వేదో చెబుతావే?-
నాదారిని పోతున్నా...."


"వద్దు వద్దు, మహాత్మా!
క్షమించండి పొరపాటే."


"ఈ ఎలుకల మూలంగా
మనసు మనసులో నవలేదు.
తిరిగి తిరిగి తెచ్చుకున్న
భిక్షాన్నము కాస్తా యీ
ఎలుకలు తినివేస్తున్నవి.


"ఓహో! అదియా, నీ కథ!-సరేగాని, ఈ
ఎలుకల-కిన్ని మెసలు ఎందుకోమరి?-
ఉండు ఉండు ఎక్కడిదో-తినుబండా
రాల వాసన-నాసు స్ఫురించి;-నమూక నన్న-
మిక్కడనే వుండియుండు.-వెనుకటి
కొ బాపని వలె-మనముగా ఈ
రహస్యాన్ని-వెంటనే ఛేదించవలెను."
"ఆ కథ ఏమి?
దాన్నివినవచ్చునా?"

# బొమ్మరిల్లు

## పేరాశ

"రాజ్యలక్ష్మి"

అనగా అనగా 'ఆశలపురమ'ను
అరు ఉన్న దొరక దేశంలో
అట్టి ఊరిలో వట్టి లోభియగు
ఊరవై ఏడుల అవ్వొక తె.

అన్నీ ఆమెకి ఉన్నవి అయితే
ఒకరోజున ఏం జరిగిందీ?
పక్క ఇంటిలో చక్కగవండే
గారెల వాసన వేసింది.

"పక్కఇంటిలో పద్మాక్షికి ఈ
పక్క అవ్వ మరుపొస్తుందా?
అయితే గారెలు తప్పక తెచ్చును
కావున సిద్ధము కావలెన"ని

అవ్వ వెంటనే నెయ్యి కాచుకొని
గుమ్మము పక్కకు చేరినదీ
తలుపు ఓరగిల వేసి వెనుకనే
నేతి గిన్నెతో నిలచినదీ.

నిప్పులు ఆర్పిన చప్పుడు విని 'ఏ
తెంచునామె' అని అనుకొనెను.
అడుగో అడుగుల సవ్వడి అవునవు
నామే ఏమో అనుకొనెను.

సవ్వడి బాగా తగ్గిపోయినది
అవ్వకు కోపం వచ్చినది.
"కానిమ్మయితే కమ్మని గారెలు
అసలే తినన"ని అలిగెను అవ్వ.

తలుపులు తోసిన చప్పుడు కాగా
అవ్వకు ఆనందం కలిగీ
మొహమాటంతో ముఖం
తిప్పుకొని

ఆదిశ చూడక "అయ్యయ్యో!
బలేదానివే! గారె లెందుకూ!
సరిలే తెమ్మ"ని అటుచూడ

అయ్యో కుక్క!
అయ్యో నెయ్యి!
పరుల సొమ్ముకై ప్రాకులాడితే
ఉన్నది కాస్తా ఊడు సుమా!

## పాపకల

'కవిరావు'

అమ్మనే కలగంటి
అర్ధరాత్రమున,
అక్కయ్య బావ నా
కగుపించినారె

అక్కయ్య నీళ్ళాడె
అబ్బాయి కలిగె
బాబుగాడే వాడు
బంగారు కొండ.

ముక్కు మొగములు అన్ని
అక్కయ్యవేనె,
బుద్ధి బాబుదె వంట
బట్టినట్టుంది.

'అత్తత్త తాత'యని
అంటాడె వాడు,
బావవలెనే వట్టి
బడాయిపిందె.

'నన్ను గన్నా తండ్రి!
నారత్న!!' మనుచు,
ప్రొద్దుగూకులు అక్క
పొంగిపోతుందె

బావ మన ఊరునకు
బదిలీయై వస్తే,
అక్కతో నేనెప్పు
డాడుకుంటానె?



# సీరియల్

# విచిత్రవ్యక్తి

**మూలం:- మార్క్ ట్వేన్**

**జరిగినకథ:—** ఆస్ట్రియాలోని ఈశెల్‌డార్ఫ్ మా స్వగ్రామం. నా యీడు వాళ్లేఅయిన సెప్పీ, నికొలాస్ అనే మరి ఇద్దరు బాలురతో కలిసి ఎప్పుడూ అడవుల్లో, కొండల్లో తిరిగేవాణ్ణి. ఒక రోజున మేము ఒక కొండమీద మా ఆస్థి స్థలంలో కూర్చుని ఉండగా ఒక కొత్తవ్యక్తి వచ్చాడు. తన పేరు సైతాను అనీ, తను దేవతననీ చెప్పాడు. మాకు చాలా వింతలు చేసి చూపించాడు. అతడు మాతో ఉన్నంతసేపూ మానవజాతిని నానాబూతులు తిట్టాడు. మానవులు తామేదో గొప్పవారమని అనుకుంటారుగాని నిజానికి వారిలో ఉన్న నైచ్యం ఇంకెక్కడా ఉండదని అన్నాడు. చివరికి మాయమైపోయాడు. మావూళ్లో ఫాదర్ పీటర్ అని ఒక మతగురువు ఉన్నాడు. ఆయన ఏ నేరమూ చెయ్యకపోయినా, పదవినుండి తొలగించబడ్డాడు. ఆయనకి సహాయం చేద్దామనో, ఏమో సైతాను పదకొండువందల బంగారు నాణాలు ఆయనకి దొరికేట్టు చేశాడు. ఫాదర్ పీటర్‌కు విరోధియైన ఒక జ్యోతిష్కుడు ఆడబ్బు తన దగ్గరనుండి దొంగిలించబడిందని ఆరోపణచేశాడు. వెంటనే ఫాదర్ పీటర్‌ను జైల్లో పడేశారు. ఆయన కుటుంబానికి సైతాను మళ్లీ సహాయంచేశాడు. ఆ సహాయం ఎవరు చేస్తున్నారో తెలియక గ్రామస్థులు తికమకలు పడి ఫాదర్ పీటర్ కుటుంబానికి సైతానుతో సంబంధమున్నదని అనుమానించారు. ఆసంగతి పరీక్ష చెయ్యటానికి నిశ్చయించారు. కాని సైతాను మాయ చేసి వారిని కిపరించాడు తప్ప రహస్యం బయట పడనివ్వలేదు. ఒకసారి సైతాను నన్ను చైనా తీసుకు వెళ్లాడు. మానవుడు తన జీవితానికి బానిస అనీ, తాను మానవునికి స్వాతంత్ర్యం ఇవ్వగలననీ చెప్పాడు. నా స్నేహితుడైన నికొలాస్‌ను జీవితం నుంచి విముక్తుని చేస్తానన్నాడు. అంటే అతడు చనిపోయేట్టు చేస్తాడని అర్థం.

## 8

ఆ రాత్రి ఎంతకీ నిద్ర పట్టలేదు: ప్రపంచమంతా చుట్టి వచ్చినందుకు, చైనాదేశం చూసి వచ్చినందుకు కలిగిన సంతోషంవల్ల కాదు. ఇంకొకప్పుడెప్పుడైనా అయితే ఆ సంతోషం వల్లనే నిద్ర పట్టకపోయి ఉండును. కాని ఇప్పుడు అది కారణం కాదు. నికొలాస్‌కు పట్టనున్న గతి, తలుచుకున్న కొద్దీ గుండె బద్దలు చేస్తోంది. అడవుల్లో, కొండల్లో, పొలాల్లో మేము ఆడుకున్న ఆటలు, నదిమీద పడవ షికార్లు, శీతకాలం మంచుమీద పరిగెత్తటాలు, బళ్లోకి వెడుతున్నామని ఇంట్లో చెప్పి, బలాదూరు తిరగటాలు, అన్నీ జ్ఞాపకంవచ్చి కళ్లనీళ్లు తిరిగాయి. ఇంతవరకూ అతడు మా జీవితంలో భాగస్వామి. ఇప్పుడు తన జాగా ఖాళీచేసి వెళ్లిపోతాడు. అతన్నిక ఎప్పటికీ చూడలేము. రేపు అతన్ని కలుసుకున్నప్పుడు, అమాయికంగా నవ్వుతూ, తుళ్లుతూ, కులాసా కబుర్లు చెబుతూ సందడి చేస్తాడు. కాని అతని అమాయకత ఆనందం చూసి నాకు కడుపు తరుక్కుపోతుంది. అతడి నెత్తిమీద నల్లటి రెక్కలాడిస్తూ మృత్యువు చుట్టూ ఎగురుతున్నట్టు కనిపిస్తుంది. ఎల్లుండి, ఆవలెల్లుండి, అలా మిగిలిన కాసిని రోజులూ తనకు మృత్యువు ఆసన్నమైందనే సందేహ లేశం లేకుండా, ఆడుతూ, పాడుతూ తిరుగుతాడు. అంతకంతకు చీక

 అనువాదం: శ్రీ నండూరి రామమోహనరావు 

# ★ విచిత్ర వ్యక్తి ★

టిలా మృత్యువు అతన్ని ఆవరిస్తోందని, నాకూ సెప్సీకి మాత్రమే మనస్సులో రాచపుండు సలపరిస్తూ వుంటుంది. పన్నెండు రోజులు—పన్నెండు రోజులు మాత్రమే; భయం వేస్తోంది తలుచుకుంటే.

క్రమంగా నేనూ, నికొలాస్ గడిపిన దినాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. ముఖ్యంగా నేను ఆకతాయితనం కొద్దీ నికొలాస్‌ను అన్యాయం చేసి ఏడిపించిన సందర్భాలే ఎక్కువగా జ్ఞాపకం వచ్చాయి. ఇంక కొద్ది రోజుల్లో చనిపోబోతున్న నికొలాస్‌ను ఆవిధంగా అన్యాయం చేసినందుకు ఎంతో సిగ్గు, విచారం కలిగి బాధ పడ్డాను.

ఒకసారి నికొలాస్ మావూళ్లో వున్న పళ్ల దుకాణం యజమానికేదో చిన్న సహాయం చేసిపెట్టాడు. అందుకు ప్రతిఫలంగా ఆయజమాని ఒక ఆపిల్ పండు నికొలాస్‌కు ఇచ్చాడు. ఆపండు చాలా పెద్దది. అంత పెద్దపండు సాధారణంగా దొరకదు. అది పట్టుకుని నికొలాస్ ఉత్సాహంగా గంతులువేస్తూ వస్తున్నాడు. దారిలో నేను ఎదురయ్యాను. మిత్రుణ్ణి అని నమ్మి నాకు పండు చూపించాడు. నేను హఠాత్తుగా పండు లాక్కుని తింటూ తింటూనే పారిపోయాను. నికొలాస్ నావెంట బడి బతిమాలాడు తనపండు తన కిచ్చెయ్యమని. నేను పండుఅంతా తినేసి మధ్యలో మిగిలిన గట్టిభాగం అతనికిచ్చాను, నవ్వుతూ. అతడు కళ్లనీళ్లు పెట్టుకుని 'ఆపండు మా చెల్లాయి కిద్దామనుకున్నాను. ఇస్తే ఎంతో సంతోషపడేది' అనుకుంటూ వెళ్లిపోయాడు. ఆముక్క నాకు బాణంలాగ గుచ్చుకుంది. అతని చెల్లెలు జబ్బుపడి లేచింది. ఆమెకు మంచి ఆపిల్ పండు ఇవ్వగలగటం అతనికెంతో గర్వకారణమై ఉండేది. అతనికా అవకాశం లేకుండా చేసినందుకు బాధ పడ్డాను. పైకి మాత్రం నిర్లక్ష్యంగా "ఏడిశావ్, పోరా" అన్నాను. నికొలాస్ సమాధానమివ్వకుండా గాయపడిన చూపుతో ఇంటికిపోయాడు. ఆ గాయపడిన చూపు ఆతరవాత ఎన్నాళ్ల వరకో నన్ను వెంటాడి బాధించింది. చివరకి ఆ సంఘటన మర్చిపోయాను. అప్పటికి మాకు తొమ్మిదేళ్లు. ఇప్పుడది మళ్లీ పైకివచ్చి పుండు సలిపినట్టు సలిపింది.

ఇంకోసారి బళ్లో నా సిరాబుడ్డి పడేసి నాలుగు కాపీ పుస్తకాలనిండా ఒలకబోసి . ఖరాబు చేశాను.

మేష్టారికి తెలిస్తే యముడిలాగ దండిస్తారు. అది నికొలాస్ మీదికి తోసేసి నాకు పడవలసిన బెత్తం దెబ్బలు అతనికే తగిలేట్టు చేశాను.

నిరుడే ఇంకో అన్యాయం చేశాను. నాదగ్గిర పెద్దగాలం ఒకటుంది. అది కొంచెం విరిగివుంది. అది నికొలాస్ కిచ్చి, బదులుగా మూడు మంచివి చిన్న చిన్నవి గాలాలు తీసుకున్నాను. నీళ్లలో గాలం వేసీ వెయ్యగానే ఒక చేప చిక్కుకోవటం, అది గిలగిల కొట్టుకోవటంలో గాలం కర్ర పుటుక్కున విరిగిపోవటం జరిగింది. అతనికి తెలియదు నే నిచ్చింది విరిగిన గాలమేనని. నేను నా దగ్గిర చిన్నగాలాల్లో ఒకటి ఇవ్వ జూపాను. కాని అతడు తీసుకోలేదు. "మనం గాలాలు మార్చుకునేట్టు ఒప్పందం చేసుకున్నాక మళ్లీ నీగాలం తీసుకుంటానా?" అని నిరాకరించాడు.

ఇలాంటివే ఎన్నో సంఘటనలు జ్ఞాపకం వచ్చి మనస్సు కల్లోలితమై నిద్ర పట్టనేలేదు. బతికివున్న వాళ్లకి మనం చేసిన అన్యాయాలకంటె చచ్చిపోయిన వాళ్లకి చేసిన అన్యాయాలే ఎక్కువగా కలత పరుస్తాయి. నికొలాస్ బతికే వున్నప్పటికీ అతనికిచావు సమీపించిందని ఎరుగుదును గదా! అందుచేత నా కతడు మరణించిన వాళ్లతో సమానమే. రాత్రి బాగా పొద్దుపోయింది. చెట్లఆకులు శోకిస్తున్నట్టు రొద చేస్తున్నాయి. కిటికీల మీద మొత్తే వానచినుకులు ఈరొదకు తాళం వేస్తున్నాయి. నిద్ర పట్టలేదు.

తెల్లారగానే ముందు సెప్పీని చూడబోయాను. సైతాను చెప్పిందంతా అతనితో చెప్పాను. నది ఒడ్డున కూర్చున్నాం. అంతా విని సెప్పీ కొయ్యబారి నట్టు నిశ్చలంగా చూశాడు. పెదిమలు కదిలించాడు కాని మాటరాలేదు. క్రమంగా అతని ముఖం పాలి పోయింది. నెమ్మదిగా కన్నీళ్లు కారాయి. ముఖం తిప్పుకుని కొండలవైపు నడిచాడు. అతని బుజంమీద చెయ్యివేసి నేను కూడా నడిచాను. ఇద్దరం మాట్లాడ కుండా ఆలోచిస్తూ అడవులు, కొండలు అన్నీ తిరిగాము. కొంతసేపటికి గుక్క తిప్పుకుని మాట్లాడ సాగాము. నికొలాస్‌ను గురించే తప్ప మరొకమాట లేదు. సెప్పీ మధ్య మధ్య తనలో తను అనుకుంటు న్నట్టు—

"పన్నెండు రోజులు! ఉహు! పన్నెండు రోజులు కూడా లేదు," అనేవాడు.

ఈ పదకొండు రోజులూ నికొలాస్‌తోనే కాలమంతా గడపాలను కున్నాం. వీలైనంత ఎక్కువ సేపు అతని సాన్నిధ్యం అనుభవించాలనుకున్నాం. అట్టే రోజులు లేవుగదా! అయినా వెంటనే నికొలాస్ వద్దకు వెళ్లటానికి మనసొప్పలేదు. చచ్చిపోయిన వాడి ప్రేతాన్ని కలుసుకోవాలన్నంత భయం కలిగింది. ఇంతలో ఒకచోట అకస్మాత్తుగా నికొలాస్ తటస్థ పడ్డాడు. దెయ్యాన్ని చూసినట్టు గుండె ఝల్లుమంది. అతడు మమ్మల్ని సంతోషంగా అరిచాడు:

"ఏరోయ్! ఇక్కడున్నారా? ఎంత వెదికినా కనబడలేదే? అదేమిట్రా? మొహాలల్లా వున్నాయి. నేనేం దెయ్యాన్ననుకున్నారా?"

మేము కుంగిపోయాము. అతని సంతోషం మాకు దుఃఖకరంగా వుంది. నికొలాస్ అప్పుడే సైతాన్ను చూసివచ్చాట్ట నేలమీద నిలవలేనంత పారవశ్యంలో వున్నాడు. నన్ను చైనా తీసుకెళ్లిన సంగతి సైతాను నికొలాస్‌తో చెప్పాట్ట. తన్నుకూడా తీసుకువెళ్లమని నికొలాస్ బతిమాలాట్ట. త్వరలో తీసుకు వెడతానని సైతాను వాగ్దానం చేశాట్ట. చాలా దూరదేశం, అద్భుతమైన, సుందరమైన, వర్ణనాతీతమైన దేశం తీసుకువెడతా నన్నాట్ట. సెప్పీని, నన్ను కూడా తీసుకు వెడదామని నికొలాస్ అనగా" వద్దు వద్దు. వాళ్లనిప్పుడు కాదు, తరవా తెప్పుడో, వాళ్లటైము వచ్చినప్పుడు తీసుకు వెడతా" నన్నాట్ట. సైతాను నేటికి పదకొండో రోజున వస్తా నన్నాడనీ, ఆరోజుకోసం ఎదురు చూస్తున్నాననీ నికొలాస్ చెప్పాడు.

# విచిత్రవ్యక్తి

అదేరోజు! నికొలాస్ చనిపోయేరోజు! ఆరోజు కోసం ఎదురు చూస్తున్నాడు!

ముగ్గురం కలిసి చాలామైళ్లు తిరిగాము. మేము ఎప్పుడూ తిరిగేస్థలాలే తిరుగుతూ, మా పసితనం నుంచీ జరిగిన విశేషాలే జ్ఞాపకం చేసుకుంటూ చాలాసేపు గడిపాము. అందరిలోకీ నికొలాస్ మహా ఉత్సాహంగా ఉన్నాడు. అతని ఉత్సాహం మా గుండెలోని గుబులును పోగొట్టలేకపోయింది. నికొలాస్‌మీద ఇంతకాలమూ మా హృదయాల్లో దాగివున్న అనురాగం వెల్లబోసుకున్నాం. అతన్ని ఏపనీ చెయ్యనివ్వలేదు. "ఆగు, మేం చేసి పెడతాం" అని ప్రతి పనికీ అడ్డం తగిలాము. నాదగ్గిర ఏడు గాలాలు ఉన్నాయి. అవన్నీ నికొలాస్‌కు 'అచ్చంగా' ఇచ్చేశాను. సెప్పీ తన కొత్తచాకూ ఒకబూరా ఇచ్చేశాడు. సెప్పీకూడా నాలాగే నికొలాస్‌ను అడపాతడపా మోసం చేశాట్ట. వాటికి పరిహారంగా ఇవి ఇచ్చాడని తరవాత నాకు తెలిసింది. మాఅనురాగం చూసి నికొలాస్ హృదయం సంతోషంతో నిండిపోయింది. అతని సంతోషం మాకు ఇంకా దుఃఖకారణమై గుండెల్లో శూలంవలె గుచ్చుకుంది. చివరికి ముగ్గురం ఎవరిళ్లకు వాళ్లు వెళ్ళిపోయాం. వెళ్లిపోతూ ఇంత మంచిరోజు ఎప్పుడూ ఎరగనని నికొలాస్ అన్నాడు.

సెప్పీ నాతో రహస్యంగా అన్నాడు: "ఇదివరకు కూడా మనకు నికొలాస్ అంటే ఇష్టంవున్నా, ఎప్పుడూ ఇంత ప్రేమ కలగలేదు. చివరికి అతనిక మనకు దక్కడని తెలిసేటప్పటికి ఇంత ప్రేమ పుట్టుకొస్తోంది."

మర్నాడూ, ఆ తరవాత ప్రతిరోజూ నికొలాస్‌తోనే కాలం గడిపాము. ప్రతిరోజూ ఉదయం లేచేటప్పుడు అనుకునే వాళ్లం: మరొక రోజు గడిచి

పోయింది. నికోలాస్ చావు ఇంకొక రోజు దగ్గిర పడింది. ఇక పదిరోజులే; ఇక తొమ్మిది రోజులే; ఇక ఎనిమిది రోజులే—"

నికోలాస్ సంతోషంగానే వుండేవాడు. మేము దిగులుగా ఉంటున్న కారణ మేమిటో అతనికి బోధపడ లేదు. మమ్మల్ని ఉషారు చెయ్యటానికి అతడు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. నవ్వటానికి ప్రయత్నించేవాళ్లంగాని అది మూలుగుగా బయట పడేది. సంగతేమిటని అడిగాడు కాని ఏదో అబద్ధం చెప్పి, ఏమీ లేదనే వాళ్లం.

అన్నిటి కంటే మాకు బాధకరంగా అనిపించింది ఒకటి నికోలాస్ తను చచ్చిపోవలసిన రోజు తరవాత రోజుల్లో ఏమేం చెయ్యాలో ఇప్పటినుంచే ఆలోచించే వాడు ఫలానా రోజున మానాన్న కొత్త బట్టలు కుట్టిస్తా నన్నాడు; ఫలానా రోజున ఫలానా చోటికి వెడదాము, అని చెప్పేవాడు. అలా అన్నప్పుడల్లా మాగుండెలు జివ్వుమనేవి. ఆఖరికి నికోలాస్ ఒక ఆలోచన చేశాడు. అతడు ఆనెల 13 వ తేదీన చనిపోవలసి వుంది. 14 వ తేదీన ఊళ్లో పిల్లల మంతా కలిసి ఊరిబయట కొండమీద 'పిక్నిక్' చేసు కుందామని అన్నాడు. "వద్దు" అందామనిపించింది కాని అతడు "ఎందుకు వద్దు?" అని అడిగితే సమాధానం ఏం చెప్పగలం? అందుకని, 'సరే వెడదా' మన్నాము. "అందర్నీ పిలిచి వద్దాం" అన్నాడు. సరే నన్నాము. కాని మేము ఆహ్వానించేది పిక్నిక్‌కి కాదనీ, అంత్య క్రియలకనీ మాకు మాత్రమే తెలుసు.

ఆ పదకొండు రోజులూ ఎంత దుర్భరంగా గడిచాయో చెప్పలేను. కాని ఇప్పుడు తలుచుకుంటే ఆ పదకొండు రోజులూ ఎంతో బావున్నట్టు తోస్తుంది. నా జీవితంలో ఆరోజులంత విలువైనవి మరిలేవు. నికోలాస్‌పై ఆరోజుల్లో నా కేర్పడినంత స్నేహభావం తరవాత మరెవరిమీదా కలగలేదు. గంటలు, నిమిషాలు లెక్కపెట్టుకుంటూ, "అరెరే మరొక గంట అయిపోయిందే" అనుకొంటూ, లోభి చిల్లిగవ్వల దగ్గిర్నించీ జాగ్రత్త పడినట్లు ప్రతి నిమిషమూ అమూల్యంగా భావిస్తూ గడిపాము.

ఆఖరి రోజు సాయంత్రం రాత్రి పొద్దుపోయే వరకూ నికోలాస్‌తో కలిసివున్నాము. ఎంత సేపటికీ



ఆతన్ని విడిచిపెట్ట బుద్ధి కాలేదు. నికోలాస్‌ను ఇంటివద్ద దిగబెట్టి బయట కొంతసేపు ఆగాము. నికోలాస్ ఆలస్యంగా ఇంటికి వచ్చినందుకు వాళ్ల నాన్న పట్టుకుని కొట్టసాగాడు. నికోలాస్ అరుపులు మాకు బయటికి వినిపించాయి. అతనికి తన్నులు తగలటానికి కారణం మేమేగదా అని విచార పడ్డాము. రేపు నికోలాస్ చనిపోతాడని తెలిస్తే తండ్రి అలా కొట్టేవాడా, అనుకున్నాము.

మర్నాడు నికోలాస్ అనుకున్న ప్రకారం వచ్చి మమ్మల్ని కలుసుకోలేదు. అందుకని మేమే అతని ఇంటికి వెళ్లాము. అతని తల్లి మమ్ముచూసి అన్నది

"నికోలాస్‌ను వాళ్ల నాన్న రాత్రి బాగా తన్నారు. ఎప్పుడూ తిరగటమే తప్ప చదువులేదాయె. మీ ఇద్దరితో కలిసి వాడు ఊరంతా తిరుగుతున్నాడని వాళ్ల నాన్నకి చెడ్డకోపంగా వుంది. మామూలుగా ఆయనెప్పుడైనా చెయ్యి చేసుకుంటే నేను అడ్డం వెళ్ళేదాన్ని, రాత్రి మాత్రం నాక్కూడా కోపంవచ్చి

(46-వ పేజీ చూడండి)



పాత్రలు :

వెంకటప్పయ్య-(బడి పంతులు)

రాముడు, రంగడు, ఆనందం, సిద్దయ్య } బడిపిల్లలు.

[స్థలం:-పల్లెటూరు వీధిబడి-సమయం-ఉదయం 8గంటలు. వెంకటప్పయ్య పంతులు యింకా బడికి రాలేదు. పిల్లలు గోలగా అరుస్తుంటారు. రాముడు బఠాణీలు తింటూ వుంటాడు]

రంగడు:-అరే రాముడూ, నాక్కాసిని బఠాణీలు పెట్టరా!

రాము: అబ్బో, ఆశ! మొన్న అర్ధనా జంతికలు కొని నాకు కొంచమైనా పెట్టకుండా తింటివే! నే నెందుకు పెట్టాలి? (గుప్పెడు బఠాణీలు నోట్లోపోసుకొని చప్పుడు చేస్తూ నములుతుంటాడు)

రంగ: అయితే మొన్న నీకిస్తినే బలపం - నాది నాకు యిచ్చెయ్!

రాము: నీకు ఆవేళ అప్పుడు పెన్సిలు ముక్క యిస్తినే - అది యిప్పుడు యిచ్చెయ్!

రంగ: అదెప్పుడోయ్? నెల రోజు లయింది. అప్పుడే చెప్పలేక పోయ్యావా, మళ్ళీ యివ్వాలని?

రాము: నువ్వు కూడా బలపం ఇచ్చినప్పుడే చెప్పలేకపోయ్యావా-నీముష్టి బలపం నీ కిచ్చెయ్యాలని?

రంగ: అప్పుడే చెప్పానోయ్!

రాము: చెప్పలేదురా.

రంగ: ఏరేయ్ 'రా' 'గీ'అంటున్నావ్ ?- ఈసారి అన్నావా, మర్యాదా దక్కదు. తెలిసిందా?

రాము: నా యిష్టంరా! హె... వీడెవడను కొన్నావో?

రంగ: నీ యిష్టం నీయింటి కాడరా.

రాము: నే నంటానురా, నువ్వు చేసుకునే దేంటో చేసుకోవోయ్; పిచ్చి పుల్లాయ్!

రంగ ఈదఫా అనుమరి-ఏం చేస్తావో?

రాము: నాయిష్టం వచ్చినప్పుడు అంటా - నీకెందుకు రా?

రంగ: మళ్లా 'రా' అంటావటరా?(చేయిఎత్తి మీదికి వెళ్తాడు)

ఆనందం: (ప్రవేశించి) అరేయ్-చిన్నవాడ్ని చేసి ఆ రాముడ్ని కొట్టతావట్రా?

రంగ నీకెందు కోయ్?

రాము: (ఏడుపు మొఖం పెట్టి) అరేయ్-ఆనందం చూడరా నన్ను కొడతాడట.

ఆనం: అరేయ్; రామూ! నీ ప్రాణం నాకివ్వరా. వీడెట్లా కొడ్తాడో చూస్తాను!



రాము: ఊఁ! ఆ! నా ప్రాణం నీకిచ్చేశాను. (అంటూనే ఆనందం వెనుకకు వెళ్ళి నిల్చుంటాడు)

ఆనం: ఇప్పుడు కొట్టరా ఏమాత్రం కొడ్తావో?

రంగ: బయటకు రమ్మను; ఆడమ్మాయి లాగా చాటున దాక్కొని...అయినా రేపు ఎక్కడికి వెళ్తాడో చూస్తాలే!

ఆనం: అరే రామూ, వీడు నిన్ను ఎప్పుడు కొట్టవచ్చినా నన్ను పిలువరా- వీడిపని నేను పడ్తాను.

రాము: ఇందరా ఆనందం బఠాణీలు (రాముడు, ఆనందం బఠాణీలు తింటూ స్టేజి చివరకు పోయి, రంగణ్ణి వెక్కిరిస్తూవుంటారు. రంగడు వీరిని చూడనట్లు నటిస్తూ పుస్తకాన్ని మొఖానికి అడ్డంగా పెట్టుకుంటాడు.

ఇంతలో వెంకటప్పయ్య పంతులుగారి ప్రవేశం-వయస్సు షుమారు 45-47 సం. 'మీారజాల గలడా నాయానతి' అంటూ కూనిరాగం తీస్తూ తాళం వేస్తూ స్టేజి మధ్యకు వస్తాడు)

వెంకటప్పయ్య: (ఒకపట్టుపొడుం పీల్చి) అరేరాముడూ. ఇటురారా.

[రాముడు వస్తాడు]

రంగ: [లేచి] పంతులు గారూ! మరండీ... రాముడండీ...నన్ను 'వెధవ' అన్నాడండీ.

వెంక: అంటే నువ్వు వెధవ వేషన్రటా...ఏరా చెప్పు?

రంగ: కాదండీ.

వెంకట: అయితే నీకు రోషము ఎందుకురా? కూర్చో మాట్లాడకుండా. రాముా, నీ పోర్షన్ను చదివావా?

రాము: చదివానండి.

వెంక: రంగడూ నీవో?

రంగ: నాకు పాఠాలు కంటే బాగా వచ్చిందండీ, పోర్షను.

వెంక: భేష్ భేష్ ఒరేయ్ సిద్దయ్యా నీడ్రామా డబ్బు లేవిరా?

సిద్దయ్య: (గోళ్లు గిల్లు కొంటూ) మరేనండీ...మా అయ్యా అన్నాడు గదా—'ఒరేయ్ భటుడు వేషం వేసేవాడికి కూడా అర్ధరూపాయే రా? ఈ పావలా పట్టు కెళ్లి యిమ్మన్నా' డండీ.

వెంక: ఓరి వెధవా! అయితే నువ్వు వేషం వెయ్యద్దు గానీ, యింకోడికి ఆ వేషం యిచ్చేస్తాలే. కూర్చో.

సిద్దయ్య: కాదండీ పంతులు గారు. రేపు మా అమ్మను అడిగి తతిమ్మా పావలా కూడా తెస్తా లేండి. ఆ వేషం నాకే వుంచండీ. ఊ...ఊ...

వెంక: సరేలే; ఏదో ఏడువు!

సిద్దయ్య: మరి పంతులుగారూ, నా వేషం ఎప్పుడు వస్తుందండీ

వెంక: ఆఖరున

సిద్దయ్య: ఆఖరునా? ఆఖరునైతే నే ఒప్పుకోనండి. అప్పటి దాకా ఎవ్వరూ వుండరండీ. నన్ను మొదల్లో పెట్టండి, ఏమైనా సరే.

వెంకట: మొదల్లో నీ పోర్షన్ లేదురా. వచ్చేదఫా వేసే నాటకంలో చూద్దాంలే.

సిద్దయ్య: [ఏడుపు మొఖంపెట్టి] ఊ...ఊ... [అంటూ కూర్చుంటాడు.]

వెంకట: ఒరే రంగా, నువ్వు కూడా యిటురా. మీ పోర్షన్‌లు కొంచం చదవండి.

రాము: [గడ గడ అప్పచెప్పి నట్లు చదువుతాడు] చెలికాడా! చూచితివా ఈ రమణీయమైన ప్రకృతిని. ఆహా...ఆనంద సుందర నందన విహారోద్యానమైన యీ వుద్యాన వనశోభను వర్ణింప నా తరమా! నీ తరమా? ముందుకు మూడు అడుగులేసి పాట పాడవలెను.

వెంకట: ఆ... ఆ... అదేమిటిరా? ముందుకు మూడు అడుగులేమిటిరా- నీ మొఖం?

రాము: నాకు వ్రాసి యిచ్చిన కాగితాలలో వుందండి.

వెంకట: అది పైకి చదవ కూడదురా. ముందుకు నడచి పాట పాడాలని దాని అర్థం. ఊ పాట పాడూ...

రాము: [సిగ్గుపడుతూ] పాట యింకా రాలేదండీ.

వెంకట: ఏడవలేక పొయ్యావు. పండగ చూడబోతే నాలుగు రోజులలోకి వచ్చేసింది! ఇంకా ఎప్పుడు చదివేది ? ...రేపు యీ వేళ కల్లా నాకు అంతా అప్పచెప్పాలి. తెలి



# సారంగదరుని పావురం

సిందా? ఈ వేళకు యిళ్ళకు వెళ్ళి కంఠతా చదవండి.

## 2

[ప్రేక్షకుల్లో నుండి గోలలూ ఈలలూ వినిపిస్తూ వుంటాయి. గ్రీన్ రూములోపల.]

వెంకటప్పయ్య: ఒరే సిద్దయ్యా, ఆ కోటు నీది కాదురా—రాముడి కిచ్చెయ్.

సిద్దయ్య నేను తొడుక్కొంటాను లెండి

వెంకట: వెధవా-చెప్పేది నీకే! నువ్వు అన్నీ చొక్కా వేసుకో.

సిద్దయ్య: వాడూ అర్ధరూపాయేగా య్చింది? మరి వాడికేమో పూసల పూసల కోటు, నాకేమో వట్టి చొక్కానా? నేను వేసుకోనండీ అసలు నేను వేషమే వెయ్యను. నా అర్ధరూపాయి నాకు యిచ్చెయండి. నే యింటి కెళ్ళిపోతాను.

వెంక. (వు సూ రు మంటూ) ఈ వఫాకు వేసుకోరా బాబూ! వచ్చే నాటకంలో యింత కన్నా మంచి గుడ్డలు ఇప్పిస్తాను.

సిద్ద: [తనలో] ఏమియిస్తాడో ఏమో! వాడేమో అందరికంటే మంచి గుడ్డలు వేసుకోవాలట; అందరి కంటే ముందు కనపడాలట, నేనేమో ఆఖరికట, రాముడుకంటే నేనే ముందు కనపడతా! ఈ పంతులు ఏం చేస్తాడో చూస్తా

వెంకట: [స్టేజి బయటకు వచ్చి] సోదరులారా! కొంచెం నిశ్శబ్దంగా వుండాలి. త్వరలో అవ్వ వచ్చుచున్నది. ఈ సంక్రాంతి పర్వదినం...

[ఆడియన్సులో నుంచి ఒకరు- 'అవ్వ వస్తుందా? తాత వస్తున్నాడా పంతులూ?' జనం గొల్లున నవ్వుతారు. పంతులు గాబరాగా లోపలికి వెళ్తాడు. కొద్ది సేపటిలో టెంకాయ కొట్టిన చప్పుడు 'పరాబ్రహ్మ' పాట వినిపిస్తాయి. తెర ఎత్తుతారు. ప్రవేశం-సారంగధరుడు, చెలిగాడు సిద్దయ్య స్టేజిమధ్యగా పాతిన స్తంభంమీద ఎక్కి కూర్చొని వుంటాడు.]

సిద్దయ్య: అమ్మోయ్! యిక్కడ యీ స్థంబం మీద వున్నానేవ్! నా నోయి యిటు చూడవే! [వెంటనే తెరపడ్తుంది. ప్రేక్షకులలో ఈలలు గోలలు]

వెంకట ఒరే సిద్దయ్యా! త్వరగా దిగరా.

సిద్ద: నేను దిగనండి.

వెంక: ఓరి నీ తలవుండు పగలా! నువ్వా - దిగుతావా? దిగవా? [చేతిలో బెత్తం ఆడిస్తూ వుంటాడు]

సిద్ద నేను చచ్చినా దిగనండి.

వెంక ఎందుకు దిగవురా?

సిద్ద: మీరు కొడ్తారండి.

వెంక: కొట్టనులే దిగరా.

సిద్ద మీరు కొట్టక పోయినా రేపు మా అయ్యతో చెప్పి కొట్టిస్తారండి.

వెంక: చెప్పను లేరా, దిగరా బాబూ!

సిద్ద: నిజంగా చెప్పరా?

వెంక: ఆ నిజంగా చెప్పను. దిగు ముందు.

సిద్ద: అయితే ఒట్టు వెయ్యండి.

వెంక: ఓరి నాప సన్యాసీ, నువ్వు పైనవుండీ నేను క్రిందవుండీ ఒట్టు ఏమిటిరా? దిగరా తెలివి!

సిద్ద: [దిగుతూ] మీరు కొట్ట




ఒంటిగీత బొమ్మ గంగిరెద్దు

చిత్రం: కె. నారాయణరావు.

నన్నారండోయ్. పలికి బొంకరాదు. అసత్యం ఆడరాదు.

వెంక: అమ్మయ్యా ఒక గండం గడిచింది...ఒరేయ్ తెర ఎత్తండిరా- రంగా-రామూడూ-మీరుయిద్దరూ రంగం మీదికి వెళ్ళండి. జాగ్రత్త.

[తెర లేస్తుంది. ప్రవేశం సారంగధరుడు; అతని చెలికాడు. సారంగధరుడి చేతిలో పంచదార చిలుక వుంటుంది]

సారంగ: చెలికాడా! చూచితివా, యీ పావురమును. అసమాన రూపసి అయిన యీ పావురమును చూచు చుండగా నా నోరు వూరు చున్నది.

ప్రాంప్టరు: 'నోరు వూరు చున్నది' కాదు! మేను పులకరించు చున్నది.

సాం; [విని] ఆ! నోరు పులకరించు చున్నది; నా నోరు పులకరించు చున్నది.

చెలి: అవునోయ్ సారంగా; ఆ పావురమును వదిలి పెట్టుము. ఎట్లు మింటి కెగియునో చూచెదము గాక!

సారంగ: ఆహా! నాముద్దుల పావురమును నేను వదలలేను! వదలను!...

నా పంచదార చిలుకను...[అని ముద్దు పెట్టుకొంటూ నోరు వూరగా దాని రెక్క- కొంచం కొరుక్కొని చప్పరిస్తూ]

...ఆహా! ఏమి చిలుక! పంచదార చిలుక!!

ప్రాంప్టరు: చిలుక కాదురా! పావురము.

సారంగ: నా పావురమును వదలను. దీనిని వదలితే బ్రతుకలేను!

చెలి: సారంగా! నీవు అట్లనుట పాడికాదు... నాకు కొంచమైనా పెట్టకుండా అంతా నువ్వే తింటున్నావట్రా?

సారంగ: వూ...నేను పెట్టను. మొన్న బతాణీలు పెట్టావేం?

ప్రాంప్టరు: అరే దీంట్లో లేని మాటలు చెప్పతారేం రా? నేను అందించనిదే మీరేమీ అనకండి.

చెలి: సారంగా నీవు వదలకున్న ఆ పావురమును యిటు యిమ్ము చూచి యివ్వగలను.

సారం: అబ్బ ఆశ! తింటానికి! నేను యివ్వనే యివ్వను!! ఇవ్వనంటే యివ్వను!!!

ప్రాం: ఒరే రామూ, నేను చెప్పందే చెప్పతారేమిరా? ఒకటి వెయ్యండిరా వాడిని.

చెలికాడు: [చిలుకను తనకు పెట్టలేదనే కోపంతో రాముడి నెత్తి మీద గట్టిగా మొట్టికాయ వేస్తాడు]

సారం: [ఏడుస్తూ] పంతులు గారూ! నన్ను యీ చెలికాడుగాడు కొడ్తున్నాడండి. [రంగడిమీద తిరగబడి కొడ్తాడు]

ఆనందం: [ప్రేక్షకులలో నుంచి పరిగెత్తు కొంటూ స్టేజి మీదకు వచ్చి] ఒరేయ్ నేను యిక్కడ వుండగా వాణ్ణి కొడ్తారంటరా? (రంగణ్ణి కొట్టబోయాడు)

[ప్రేక్షకులు గోలగా లేస్తారు. పంతులు బయటకువచ్చి పిల్లలను సర్దుతూ! 'నాఖర్మం' అనకొంటూ నెత్తి కొట్టుకుంటుండగా తెర వాలి పోతుంది.]

★




మహాత్మా పిక్చర్సు

# జగన్మోహిని

తెలుగు

నిర్మాణము దర్శకత్వము
**డి. శంకరసింగ్**
అసోసియేట్ ప్రొడ్యూసర్
**బి.వి. ఆచార్య**

రజితోత్సవము జరిపికొన్న ఈ చిత్రం
నేడు కర్నాటక మంతటా
ప్రదర్శింపబడుచున్నది.

**RAJSHRI PICTURES LTD, RELEASE.**

# ★ మెతక నేల ★

(29–వ పేజీ తరువాయి)

గరిడీలాళ్ళతో సహా కనపడి — "రంగయ్యన్నా–యింకా నూత్తావేమే?–ఎదురు తిరిగి శంకరంగాణ్ణి రొండుతుకు–అమీనాని గంటేయ్...నువ్వు ఊ అంటే మేమూ, మాపార్టీ ఒచ్చి బరిలో దిగుతాంగా — కానియ్" అని ఊళకొలిపాడు..."ధూత్తెరి ...ఆళ్ళన్యాయం జేత్తన్నారని – నేనూ పాపం గట్టుకోనా? ఈ పీటముళ్ళయెవారం నాకెందుకులే రాజియ్యన్నా! నాకోసం మీరంతా యేష్టపడమాకండి బాబూ" అని జెప్పి తిరిగొచ్చాడు, పావిట్లోకి.

రాజియ్యల్లు డెంటయొల్లిన పాపానికి గావల్న–శంకరయ్య మరీ నుప్పదొక్కిన కోతికి మల్లే ఎగిరాడు; తనే గిత్తల్నాడదీశి బైటి కదిలించాడు. కొడుకులకంటే యెక్కువగా పెంచుకుని, ఆటిఆధారంతో బదుకు గడుపుకుంటూండ నాకు – రామలచ్మల్ని అన్యాయంగా తోలుకెల్తాండందుకు, శంకరయ్యని నరికినా పాపం లేదనిపిచ్చింది ... అయినా నా గుండెల్లో మంట మింగేశాను ... ఏనాడూ ఒకళ్ళ పచ్చి మంచినీళ్ళకన్నా జాపని చేతుల్తో శంకరయ్య చేతులూ, కాళ్ళూ పట్టుకుని "రొణ్ణాల్లాగి, రచ్చించ"మని మొత్తుకున్నాను. అయినా ఆడి గుండెలు మెత్తబడలేదు. ఆడు మడిశి కాదనిపిచ్చింది. యింటిది "అంతపరువుగా, దరమరాజుమల్లే బదికిన ఆయన, నీ కాళ్లు పట్టుకున్నా కనికారం లేకపోయిందా? రొండు రోజుల్లో, నీకెగ్గొట్టి, పూరొదిలిపోతామా!? మీ కడుపున బుడతాం, మా బిడ్డల్నొదలండిబాబూ" అని మొత్తుకుంటూ గిత్తల కడ్డం ఎల్లింది.

శంకరయ్యొంబటొచ్చిన గుంపంతా యికయికా నవ్వేరు...ఎవడో "ఇక బజార్న పడవేయ్" అని కూశాడు. తన రగతం వుడికిపోయింది. "నువ్వింటో తగులడక యిట్టా ఎందుకు జచ్చావే బోడీ" అని యింటిదాన్ని మెడబట్టి గెంటాను...పాపం—అది దొడ్డి గమిడిమీద పడిపోయింది. ఇంతట్లో రామలచ్మల్ని చకచకా తోలుకుపోవాలని శంకరయ్యే కర్రతో బాదుతున్నాడు. రామలచ్మలు మోరలెగబట్టి — తనవేపు తిరిగినయ్; అడుగు ముందుక్కదల్లేదు. శంకరయ్య పెద్ద పాలేరు బాణాకర్రతో రాముణ్ణి దూడేకినట్టు బాదాడు. లచ్మడు ఆపాలేరు మీదకి దూకింది ... ఆళ్ళ వోస్తాదులంతా కర్రలెత్తి దాన్ని ముట్టిమీద కొట్టి బైటికి తోలారుగాని—లేకపోతే ఆ పాలేరు జచ్చేవాడే...ఆ రాచ్చసుల దెబ్బలకి రామలచ్మలు రగతమోడ్చినయ్. "నువ్వుండి కూడా, మమ్మల్నిట్టా జేశావా?" అన్నట్టు జూస్తా యెల్లిపోయినయ్. శంకరయ్యమటా అంతా తననీ; తన యింటిదాన్నీ; తన వొంశాన్నే లేవిడీ గొట్టినట్టు–కేరింతాలతో గిత్తల్ని తోలుకెల్లిపోతే–తను ఏమీ చెయ్యలేని ఎదవై సదికిలబడ్డాడు.

పొద్దూకేదాకా కలకలలాడతాండ యిల్లు, జాంసేపుట్లో ఏడుపుల్తో నిండిపోయింది. ఆకరి కల్లుడుగూడా మొకంమీద గుడ్డేసుకూర్కున్నాడు. మాశేపుటికి రాజియ్యల్లు డొచ్చి "ఇప్పుడే తాలూకాకి తోలుకెల్లేపొద్దున్నే ఏలా మేత్తారంటే, నీ గిత్తల్ని" అని చెప్పిపోయాడు. దాంతో తన నడుం యిరిగిపోయింది. నవనాడులూ కుంగిపోయినయ్. ఇక తనేంజేసినా తన బిడ్డల్లాంటి గిత్తలు తిరిగిరాకుండా యెత్తులేశాడు శంకరయ్య. అంతకంటే గోరంగా- తన వొంశం పరువూ, పెతిష్టా నడిబజార్లో మానబంగం జేశాడిట్టా.

ఇంటిది తన మంచే, తన్ని కాలదోసిందనీ; మేనమామన్నమిత్ర సంతకం బెట్టి కొంపకే చిచ్చుబెట్టాననీ; – తన వంశాన్నే శాపనార్థాలు సాగిచ్చింది. దానిమనసులో ఎట్టా కుంపటి రాజుతాందో తెలుసుకోకండా, యిందాకే తొందరపడి, పడదోశిన తను—యింకా ఏ మొకంతో దాని మొకం చూడాలి? ఇంటో ఏడుపులూ, శంకరయ్య మటా కూతలూ, రామలచ్మల రగతమూ, అవుమానంతో కుంగిపోయిన గుండెలతో తనకి అంపశెయ్యమీద కూచ్చున్నట్టయింది.

ఎంత ఒదిగొదిగి, సత్తెపెమాణకంగా బదికినా—యింత అభాసు జగిరింది గందా – యింకా తనంటోళ్ళుండి సంసారానికేం పెయోజనం అనిపిచ్చింది. అంత పరువుగా బదికిన తను, డికిలీలూ, జబుతులూ, ఏలాలపాలై – యింకా నలుగుర్లోనూ తలెత్తుకు ఎట్టా తిరుగుతాడు? అందుకే పేణంమీద అసయ్యమేశింది, ఆవజాన చేతి కర్ర బుచ్చుకుని—కాళ్ళు నడిశినట్టుగా నడిశి యీ పొలిమేర కాలవగట్టుమీద, రాయిచెట్టుకింద కూలబడ్డాడు. ఇక జర గాలిశం లేమిటా అనుకున్నాడు.

అత్తారింటికాణ్ణుంచి భీమయ్య తిరిగొచ్చి రామలచ్మల పోక దెలిత్తే ఎంత కుమిలిపోతాడు! ఆ జసలే కోపదారిమడిశి. శంకరయ్యతో ఏంతగూ యేగుతుంటాడో ఇక తన కుటుంబం బజార్నబడి నానా భీభత్సం అయిపోతంది గాని—బదికి బట్ట గట్టేట్టు లేదు. అందుకనే తను కుక్కమూసుకు గంగలో దిగితే అదంతా కూడటమన్నా తప్పుతుంది...

చుట్టూ జూశాడు. యేగుజుక్క పొడిశి పైకెక్కింది. అల్లంతదూరంలో కొంతయ్యగారి కుప్పనూర్పిడి సాగిచ్చారు. కొందరు పాలేళ్ళు చలిమంట లేసుకుంటండారు. చలిమంట ఎక్కువయింది. తనకేమీ తోసటంలేదు. గుండెల్లో పూశ పూదర గమ్మకున్నట్టు గజిబిజిగా వుంది.

ఎవరో పూరేపునుంచి రొండు లాంతర్లు బుచ్చుకుని అటే వొత్తన్నారు. తన్ని జూశి ఏమనుకుంటారోనని తను లేచి, కట్టుపాటు కెల్లబోయాడు. సరిగ్గా బేటరీలైటు తన కళ్ళల్లో బొడిశినట్టయింది. కళ్ళు చిరతలారినయ్. ఎంబటే "అదుగో మామయ్య" అనే అరుపూ; "నాన్నా – నాన్నా" అని చిట్టిపిలుపూ యినిపిచ్చినయ్. తను యిచిత్రంగా, నిలువుగాళ్ళబడి సుంచున్నాడు. ఇంటెల్లపాదీ-పాలేరు కూడా – తన్నెతుక్కుంటూ గావన్న వొచ్చేశారు. బుడ్డాడు ఒగత్తుకొచ్చి కాళ్ళకి చుట్టేసుకున్నాడు.

"నా కంటం నరికిపారేశెయ్యల్లండి" అంది యింటిది. "కానాలంటే మా సొంత గిత్తల్ని కప్పీపాటికి తోలిపెడతాలే మామయ్యా" అన్నాడల్లుడు. "పెద్దోరు మీకే యింతిదయితే–అందరూ ఎంత బేజారైపోతారో నూడండి దొరా!" అన్నాడు పాలేరు. "మమ్మల్నందర్నీ ఏ గంగలోనో తోసిపొండి" అంది చిన్నకూతురు. "మేమేం తప్పు జేశామని –మా మీదలిగొచ్చావు నాన్నా" అని చిట్టి నడుం వాటేసుకునేసరికి – రంగయ్య గావురుమని, చిన్నబిడ్డల్నిద్దర్నీ యెత్తుకున్నాడు. దూరాన కోడిపుంజు ఖంగున కూశింది.

బుడ్డోడు–"రానాన్నా" అన్నాడు... అదే సొరంలో రంగయ్య 'పదమన్న'ట్టు యినిపిచ్చింది.

★



# విచిత్రవ్యక్తి



(39-వ పేజీ తరువాయి)

బాగా తగలనివ్వమన్నాను. మరీ అంత తిరుగు బోతయితే ఎలా చచ్చేది?"

మేము గుడ్లలో నీళ్లు గుడ్లలోనే గుక్కుకున్నాము. "ఈ ఒక్కసారికైనా మీరు నికొలాస్‌ను కొట్టకుండా చేస్తే బావుండేది," అన్నాను.

ఆమె అప్పుడు బట్టలు ఇస్త్రీ చేస్తోంది. ఇస్త్రీ పెట్టె అక్కడ పెట్టి నాకేసి చూసి "ఏం?" అని ఆశ్చర్యపడి అడిగింది.

సమాధానం ఏం చెప్పటానికీ తోచలేదు. ఆమె జవాబుకోసం ఇంకా నాకేసే చూస్తోంది. ఇంతలో సెప్పీ అందుకున్నాడు:

"ఏమీ లేదండి. రాత్రి నికొలాస్ మాతో మిమ్మల్ని గూర్చే చెప్పాడు. "మా నాన్న ఎప్పుడు కొట్టవచ్చినా మా అమ్మ అడ్డంవచ్చి కొట్టకుండా చేస్తుంది. మా అమ్మ ఎంతో మంచిది, అని రాత్రి పొద్దుపోయేదాకా మీ గురించే కబుర్లు చెప్పాడండి. మాక్కూడా ఎంతవిన్నా వినబుద్ధేసి అలాగే కూర్చుండి పోయాం. అందుకనే రాత్రి నికొలాస్ ఇంటికి వచ్చేటప్పటికి అంత ఆలస్యమైంది."

"నిజంగానా? మా నాయన నన్నుగురించే చెప్పాడా?" అని ఆమె కన్నీళ్లు తుడుచుకుంది.

"నిజంగానండీ! కావలిస్తే థియొడోర్ నడగండి," అన్నాడు సెప్పీ.

"అయ్యో, నికొలాస్‌ను అనవసరంగా కొట్టించాను. నే నెంతో మంచిదాన్నని వాడు పొగడినందుకు నే నిచ్చిన బహుమానం ఇదీ. పాపం వాడు ఎంత జాలిగా ఏడ్చాడు. ఎంత రాతిగుండె దాన్ని," అని నికొలాస్‌తల్లి మళ్లీ కన్నీళ్లు తుడుచుకుంది.

సెప్పీ అడిగాడు "నికొలాసను ఒక్కసారి బయటికి పంపిస్తారా?" అని.

"ఊహు. వాళ్లనాన్న వాణ్ణి ఇంట్లోంచి కదిల్తే కొడతానని చెప్పారు."

ఒక్కసారిగా ఆశ ఉదయించింది. నికొలాస్ ఇంట్లోంచి కదలకుండా ఉంటే నదిలో మునిగే అవకాశం ఉండదు. కనుక ప్రమాదం దాటిపోతుంది," అనుకున్నాం.

'నికొలాస్ ఈరోజంతా కదలటానికి వీల్లేదా? లేక మధ్యాహ్నం వరకేనా?" అని అడిగాడు సెప్పీ.

"రోజంతా కదలగూడదు. పాపం వాడొక్కడే మేడమీద కూర్చునున్నాడు. ఎప్పుడూ ఇంట్లో కూర్చునేఅలవాటు లేదేమో, ఏంత టం లేదట."

సెప్పీ ధైర్యంచేసి అడిగాడు:

"మేము కూడా మేడమీదికి వెళ్లి అతనితో కబుర్లు చెబుతూ కూర్చుంటా మండి."

"సరే, అలాగే వెళ్లండి. ఇదుగో ఈ బిస్కట్లు తీసుకోండి. ఒకటి నికొలాస్ కివ్వండి," అన్నది ఆమె.

నికొలాస్ గదిలోకి వెళ్లగానే ముందు గడియారం చూశాం. పావు తక్కువ పది అయింది. అరె! ఇంక కొద్ది నిమిషాలే టైమ్ వున్నది! నికొలాస్ మమ్మల్ని చూసి చెంగున ఎగురుతూ లోనికి తీసుకుపోయాడు. అతడు ఉత్సాహంగానే వున్నాడు. 14 వ తేదీన జరగబోయే పిక్నిక్‌కి ప్లానులు వేస్తున్నాడు.

"కూర్చోండిరా. నేను ఒక మంచి గాలిపటం తయారు చేశాను. మాదొడ్లో ఆరబెట్టాను," అన్నాడు నికొలాస్.

పిక్నిక్ రోజున ఆటలపోటీలు ఏర్పాటు చేద్దామనీ, గెలిచినవాళ్లకి బహుమతు లిచ్చేందుకు తను దాచుకున్న డబ్బుపెట్టి రకరకాల వస్తువులు కొన్నాననీ అన్నాడు. ఆ వస్తువులన్నీ బల్లమీద అమర్చి గర్వంగా చూడమన్నాడు. "గాలిపటం తీసుకుని ఇప్పుడే వస్తా" నని చెప్పి గబగబ మెట్లు దిగి కిందికి వెళ్లాడు.

మేము మాటామంతీ లేకుండా చూస్తూ కూర్చున్నాం. బహుమతివస్తువులను ముట్టుకో బుద్ధి కాలేదు. గడియారం వంకే చూస్తూ సెకండ్లు, నిమిషాలు లెక్కపెడుతున్నాం. నిమిషాల ముల్లు కదిలినప్పుడల్లా ఉలికిపడేవాళ్లం. సెప్పీ నిట్టూర్పు విడిచి అన్నాడు;

"రెండు నిమిషాలు తక్కువ పది అయింది. ఇంక ఏడు నిమిషాలు! అది దాటితే నికొలాస్‌కు గండం గడిచిపోతుంది. థియుడోర్! నిక్ బతుకుతాడు. తప్పకుండా బతుకుతాడు."

"హుష్! ఆగరా. నాకు ముళ్లమీద వున్నట్టుంది. గడియారం చూస్తూ మాట్లాడకుండా కూర్చో," అన్నాను.

ఇంకా అయిదు నిమిషాలు! ఊపిరి బిగపట్టి గడియారపు టిక్‌టిక్ శబ్దం వింటున్నాం. అయిదు నిమిషాల్లో చావో, బతుకో తేలిపోతుంది. ఇంకా మూడు నిమిషాలే! ఒళ్లంతా గగుర్పొడిచింది. మా గుండె చప్పుడు మాకే స్పష్టంగా వినిపిస్తోంది. ఇంతలో మెట్లమీద ఎవరో వస్తున్న చప్పుడైంది.

"ఆ, అదుగో, నికొలాస్ వస్తున్నాడు. ఇక భయంలేదు. బతికాడు," అనుకుని లేచి మెట్లవద్దకు వెళ్ళాం.

(ఇంకావుంది)





చిత్రలేఖనము ఉత్తమకళలలో నొకటి. చతుష్షష్టి కళలలో ముఖ్యమగు - గీతము, వాద్యము, నృత్యము, ఆలేఖ్యము అను మొదటి నాల్గు కళలలోను ఇది పేర్కొనబడినది. కనుకనే ప్రాచీన శిల్ప గ్రంధములందు,

"యథా సుమేరుః ప్రవరో నగానాం
తథాకలానా మిహాచిత్రకల్పః"

అని కీర్తింపబడినది. మరియు,

"రూపభేదా ప్రమాణాని
భావలావణ్య యోజనం
సాదృశ్యం వర్ణికాభంగ
ఇతిచిత్రం షడంగకం॥"

అను ఆరు అంగములు గలిగి సంపూర్ణ స్థాయిలో రూపొందినది. ఇది అనేక కళలకాధారమై, వానియందంతర్భూతమై గూడ నున్నది.

ఒక కళయందు తీర్ణత నొందిన వ్యక్తి అనేక కళలలో బుద్ధిని వినియోగించి ప్రతిభను ప్రకటింపగలుగును. ఈ విషయమునే కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమున వ్యక్తపరచినాడు - శకుంతలను అత్తవారింటికనుపునపుడు, ఆమెను అలంకరించుచున్న ఒక చెలికత్తె; "సఖీ! అసయుక్త

భూషణోఽయం జనః। తథాపి చిత్ర
కర్మ పరిచయేనేదానీం, తే అంగే
ష్వాభరణవినియోగం కుర్వః॥"

అనును. అనగా మేమెన్నడు ఆభరణముల తీర్చి దిద్దుకొన్నవారము కాము. అయినప్పటికిని చిత్రలేఖనమందు నైపుణ్యముండుటవల్ల, నిన్ను సలక్షణముగ అలంకరింపగల్గుచున్నామని పల్కెను.



చిత్రము 1:—ముత్యాలముగ్గు. — గాజుల మలారం.

ఇందు రెండుకరముల బాణపుగుర్తులచే చుక్కలను చుట్టివచ్చిన గీట్లు చూపబడినవి. చుక్కలుంచిన తరువాత మొదట ఒకమూలికి యున్న బాణము చూపునట్లు ముగ్గుపోసి, తదుపరి రెండుములుకుల బాణముగుర్తు ప్రకారము పట్టు పూర్తిచేయుదురు. ఈ ముగ్గు మొత్తము రెండుగీట్లతో పూర్తి యైనది.

చిత్రలేఖనమందు పరిపూర్ణత నందవలెనన్న, చతుష్షష్టి కళలలో విశేషకచ్ఛేద్యము, తండుల కుసుమ బలివికారము, పుష్పాస్తరణము, దశన వసనాంగరాగము, మణిభూమికాకర్మ, మాల్యగ్రథన వికల్పములు, శేఖరకాపీడ యోజనము, నేపథ్య ప్రయోగములు, కర్ణపత్ర భంగములు, భూషణయోజనము, మొదలుగాగల అనేక కళలగూర్చి తెలుసుకొనవలెను.

గృహాలంకరణమందే ఈ కళలన్నియు వికసింపుచున్నవి. మహిళలలో బాలికలు మొదలు, ముదుసలులవరకు జీర్ణించియున్న పరిపూర్ణత యీకళ నందుచున్నది. స్త్రీల సంస్కృతిసభ్యతలకు, విజ్ఞానమునకు, కళానైపుణ్యమునకు, కల్పనాశక్తికి చిహ్నమై ఈకళలు విలసిల్లుచున్నవి.

ముగ్గుల రచన యొక ప్రత్యేకకళ. ఇది చతుష్షష్టికళలలో అరవదియగు తండుల కుసుమ బలివికారము అని (బియ్యపుపిండి, పూవులు మొదలగువానితో భూత తృప్తి కొరకు పెట్టెడు ముగ్గులు) ప్రత్యేక కళగా పేర్కొనబడినది. చిత్రలేఖనమందు ఈ ముగ్గుల రచన ఇమిడియుండుటే గాక, చిత్రలేఖనమునకు గల లక్షణములే దీనికి గూడ గలవు.

గృహాలంకరణ నిమిత్తము గోమయము; గుల్లముగ్గు; పసుపు; పసుపుసున్నము కలుపగా వచ్చిన పారాణి లేక కుంకుమ ఎక్కువగ వాడుచుందురు.

గోమయము ఆరోగ్యమును కాపాడు వస్తువులలో ముఖ్యమైనది. క్రిమిహారి. వాయుదోషములు, మశూచికాది దోషములను రానీయదు. దోషలబాధను నివారించును. గోవువల్ల సంప్రాప్తించు ప్రతి వస్తువు ఆరోగ్యప్రదము, మంగళప్రదము. కావుననే, ("గోమూత్రం గోమయం సర్పిః క్షీరం దధిచ రోచనా। షడంగమేతత్పరమం మాంగల్యం సర్వదాగవాం"॥— పంచగవ్యవిధానము) గోమూత్ర, గోమయ, గోఘృత, గోక్షీర, గోరోజనములు మంగళప్రదములని వచించిరి. అప్పుడు వేసిన గోమయము కస్తూరితో తుల్యమని ఆయుర్వేదవైద్యులందురు. గోమయమింతటి ఆరోగ్యప్రదమగు వస్తువు గావుననే మత సంబంధమగు ప్రతి క్రియయందుమ

మొట్టమొదట "గోమయేనానులిప్య" అని వచింతురు.

పసుపునకు గుణప్రధానముగా "క్రిమిఘ్న" యనిపేరు. రంగు కలిగించునదిగావున "వర్ణవిధాయిని"; స్త్రీలకెక్కువ ప్రియమైనది, "యోషప్రియా"; పసుపు గృహాలంకరణయందే గాక, గృహిణియలంకరణమందుగూడ విరివిగా నుపయోగపడుచున్నది.

ముగ్గ కూడ క్రిమిహారి; ఉష్ణమును కలుగజేయును. కావున గృహాలంకరణయందేగాక, సున్నము రూపములో తాంబూలమున లోనికిగూడ తీసికొనుచుందుము.

గోమయముతో అలకిన ప్రదేశము నీడవారిన ముదురాకు పచ్చరంగు గలిగి, చీకటిగను, తేమగను యుండును. అందుచే గోమయ మెంత ఆరోగ్యకరమైనను చూడగనే మనస్సునకు చీకాకు, నిరుత్సాహము, ఆందోళన కలుగును. నీలపు టాకాశమున తెల్లని తారలవలె, బాగుగా నలికిన ప్రదేశమున నుంచిన ముగ్గు సాత్త్వికతను స్ఫురింపజేయుచు, అందము నిచ్చును. కనుకనే, "అలికిన ఇంట ఒలకినా అందమే!" అను సామెత ప్రచారమందున్నది.

ముగ్గులనుంచు ప్రదేశమును ముందు గోమయపు నీటితో ఒత్తుగా కలాపు చల్లి గాని, ఇసుకపాలు కొద్దిగాగల మన్ను, గోమయము, వరిపొట్టు ఈ మూటితోను బాగుగా మర్దించిన పదార్థముతో అలికి గాని సిద్ధపరతురు. ఈ పదార్థములతోనే, ఈ తీరుననే మొదట అజంతా చిత్రకారులు చిత్తరువులు చిత్రించుటకు ముందు గోడల పూతపూసి, తదుపరి చిత్రరచన చేసినట్లు పరిశోధకుల పరిశోధనలు తెలుపుచున్నవి.*

సూత్రమునకు గ్రుచ్చబడిన ముత్యముల చేరువలె కాన్పించు ముగ్గులకు ముత్యాల ముగ్గులని; బహుముఖములుగల్గి, కోణములు తేలునట్లు పెట్టుముగ్గులు రత్నాల



చిత్రం 2.—'ద' అను తెలుగు అక్షరము ఆధారముతో చిత్రించు అంచుముగ్గులు

ముగ్గులని; నిదానముగ కర్రలవంటి గీట్ల (+ గుర్తుగాని, × గుర్తుగాని) తో గుర్తులుంచి చిత్రించు ముగ్గులు కర్రముగ్గులని; రంగుల చూర్ణములతో చిత్రించు ముగ్గులకు రంగవల్లులని మొత్తము నాలుగు విధములుగా ముగ్గులు విభజింపబడినవి. మొదటి మూడురకములు గృహాలంకరణమందు కాన్పించును. వ్రతములందు మొదట "రంగవల్యాభిరలంకృత్య" అని యనుచుందురు. అనగా వ్రతాదులందు, పూజాప్రదేశములందు, వివాహములో అయిదవరోజు నాకబలి మొదలగువానియందు ఈ రంగవల్లుల నలంకరింతురు.

నిదానముగా ముగ్గు కర్రలు తీయుటకు, చిగురుకొట్టుటకు ముగ్గుగొట్టమని, చిగురు కర్రయని రెండు పరికరములు గూడ కలవు. ఏ పరికరము సహాయము లేకుండ, ముగ్గు బొటనవ్రేలితోను, చూపుడు వ్రేలితోను కలిపి పట్టుకొని చేతితోనే పెట్టు ముగ్గులకు పోతముగ్గులని పేరు.

పోతముగ్గునకు మూలము, ప్రారంభము చుక్కలేక బిందువు. ఈ చుక్కలు ముత్యాలముగ్గులందు పెట్టినవి పెట్టినట్లు కాన్పించుచుండును. రత్నాలముగ్గులందు అట్లు చుక్కలు కాన్పించవు. కాని,



చ॥ "ద్యుతిధర దేవకీ తనయ। తోయభవస్తుత భూరమేశ సం
మిత గుణసార భూతిదయ। మేయ బృహజ్జవ పూరుపావనా
జిత నరకా పురాతనయ। జేయ సువిస్ఫుర భారవాహ శా
శ్వత పురుహూత పీతదవ। పావకశేష్ఠ పురాణకోవిదా."

—అప్పకవీయము.

* "The Classic art of Ajanta: The process used in the Paintings.

Simple though the process used at Ajanta was, its durability has been marvellous. A plaster chiefly composed of clay, cow-dung, finally chopped straw or paddy husk formed the first layer which was applied to the rough-hewn stone walls to render them smooth.

—Samarendranath Gupta.

# ముగ్గులు

ప్రతికోణమును ఒక్కొక్క చుక్కగ పరిగణింపవచ్చును. చిత్రకారుడు తాను చిత్రించు చిత్రమునకు ముందు స్థలనిర్ణయము చేసికొనినట్లే, స్త్రీలుగూడ మొదట నియమిత ప్రదేశములో చుక్కలుంచి,



వానిని నియమబద్ధముగా కల్పుచుందురు. ఈ కల్పునపుడు వారు ఏ చోటనుండి ఎచ్చట ప్రారంభించిరో అచ్చటికే వచ్చి ఆపుచేయు పట్టుదలతో పెట్టుముగ్గులనే 'పట్టు' అని అందురు. ముత్యాల ముగ్గులన్నీ ఇట్టి పట్లే. (1 వ చిత్రము)

కవుల రచనలందు, చిత్రకారుల చిత్తరువులందు పరిసరముల ప్రభావము వారివారి రచనలందు, చిత్తరువులందును గోచరించునట్లే స్త్రీలు పెట్టు ముగ్గులందు వారి పరిసరముల చెక్కువగా నుండునవి, వారి కెక్కువ అవసరము కల్గు వస్తువులే కాన్పించును. మచ్చునకు - గాజుల మల్లారం, పెళ్ళి అరుగు, తులసికోట, మల్లె పందిరి, తీగలపందిరి, పారిజాతము, గులాబిగుత్తి, పట్టుడాలు, గోకర్ణము, గదులపెట్టె, పీట, ఊయల, గుమ్మడి పండు, మారేడుదళము, కళ్యాణమండపము, చిడతలు, సాలెగూడు, తేలు, తాబేలు, రధము, దర్పణముడి, స్వస్తిక, నిమ్మగుత్తి మొదలగునవి.

వస్తు సామ్యముతో చిత్రించు ముగ్గులు సాధారణముగా రత్నాలముగ్గులందు, కఱ్ఱ ముగ్గులందు ఎక్కువగా నుండును. ఈ ముగ్గులందు రేఖాగణిత సంబంధమగు ఆకారములు—చదరము, దీర్ఘచతురస్రము, డైమన్ ఆకారము, షడ్భుజి, అష్టభుజి, త్రిభుజము, వృత్తము మొదలగునాకారములు కాన్పించును. రేఖాగణితము యొక్క అందమును గ్రహించి, తాముందు రత్నాలముగ్గులందు చుక్కల నాధారముతోనే స్త్రీలు సునాయాసముగ చిత్రింప నేర్చుట ముదావహము.

ఉత్తమ శిల్పులు, చిత్రకారులవలె పరిసరములందలి వస్తువులరూపకల్పన చేయుటే గాక, వారికల్పన (*Design*) లకు గల లక్షణములు (*Symmetry, and Running*), రీతులు గూడ చూడగలము.

ముగ్గులలో చుక్కలకు బదులు అక్షరముల యాధారముతో చిత్రించు ముగ్గులు కూడ కలవు. "ఆంధ్రభాష యమృత మాంధ్రాక్షరంబులు ముద్దులొలుకు సుంద్రమైన ముత్యములు," అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు వచించినట్లు, ఆంధ్రాక్షరములె ఆంధ్రుల అపూర్వ చిత్రకళానిపుణతకు పరమ నిదర్శనములు అట్టి అక్షరములందలి కళానైపుణ్యమును గ్రహించగలిగినవారగుటవల్లనే, నారీమణులు గూడ జాతీయ చిత్రకళకు ప్రథమ సోపానమగు ముగ్గులందుగూడ అక్షరముల నలంకరించి,




(మాణవక వృత్తము—)
"గాదిలితో మాలదిగా
గాదిల కించెన్ బదిగా
గాదిబ కృష్ణుం డదిగా
గాదిడ వాచాలిదిగా.

—అప్పకవీయము."

చూచువారి హృదయముల నుప్పొంగ చేయుచున్నారు. (2 వ చిత్రము)

అక్షరముల నాధారముతో నుండు ముగ్గులెక్కువ అంచులందు కాన్పించును. చూచిన ప్రతి ఆకారమును ముగ్గునందు ఇముడ్చు నేర్పరితనము, సమయస్ఫూర్తిగా అలంకరించు నేర్పు, స్త్రీల కల్పనాశక్తిని తెల్పుటకీ ముగ్గులే నిదర్శనములు.

ధనుర్మాసమునందు అనగా సూర్యుడు ధనుస్సులో ప్రవేశించినది మొదలు, మకర రాశిలో ప్రవేశించువరకు ముగ్గులను వీధులందు విరివిగా చిత్రింతురు. అట్టి తరి ప్రతి గృహ మొక చిత్రశాలయగును. ప్రతి గృహిణియొక చిత్రకారిణిగ గోచరించును.

ధనుర్మాసారంభము మొదలు సంక్రాంతి ప్రవేశించునప్పటికి, రైతు ఎండ వానల కోర్చి పండించిన పంట కొంప జేరును. తమ కష్టార్జితమైన పంట ఇంటికి జేరునప్పుడు యుండు ఆనందమునకు మేర యుండునా! "ఆనందో బ్రహ్మ" యని ఆనందపారవశ్యమున అవతరించునదే కళ. కనుకనే ధనుర్మాసము నెలరోజులు కళారాధన, కళాపోషణ ఎక్కువగా నుండును. "దేహీ" అన్నవారికి "లేదు" అన్నమాట యనకుండ దానధర్మములొనర్చుటే గాక, ప్రతిజీవిని తృప్తిపరచవలెననే తలంపుకు వీధి వరండాల వ్రేలాడకట్టు వరికుచ్చులే పరమ నిదర్శనము.

ధనుర్మాసమందు ప్రజలు ఉత్సాహవంతులై పుష్పములవలె వికసించిన హృదయములతో నుందురు. జనుల ఈ చిత్తవృత్తిని తెలియజేయు తలంపుతోనే, అప్పకవీయమందలి గుచ్ఛబంధమును పోలిన వికసించిన పుష్పమును; దాని సౌరభముచే నాకర్షింపబడిన కృష్ణసర్పములను వీధులందు విధిగా ముగ్గులలో చిత్రింతురు. ఆ ముగ్గుమీదనే బాలికలు గొబ్బి పూజ చేయుదురు. (3 వ చిత్రము)

గుచ్ఛ బంధమును పోలిన ముగ్గులేగాక, కుండలి నాగబంధమును పోలిన పాముల చుట్టల ముగ్గులచేగూడ ధనుర్మాసమందు వీధులను విరివిగా అలంకరింతురు. మెలికలు తిరిగియుండు ఈ పాముల చుట్టలు అప్పటి ఋతుధర్మమును తెలియజేయుచుండును. అది హేమంత ఋతువగుటచే మంచునకు, చలికి ప్రజలు పాము మెలికలు తిరిగినట్లు పెనవేసుకు పోదురని స్ఫురింపజేయుచుండును. (4 వ చిత్రము)

చిత్రాకారముగా వ్రాయబడెడి కవిత్వమునకు చిత్రకవిత్వమని పేరు. చిత్రలేఖనము, సారస్వతముల కలయికే బంధ కవిత్వముగ రూపొందెను. ఆ ప్రతిబింబములే ముగ్గులందు గూడ గోచరించుచుండును.

ఇట్టి సన్నివేశములు దృష్టికి వచ్చినపుడు విజ్ఞానవంతులగు మేధావులకు అనేక అద్భుతవిషయములు గోచరించుచుండును. అప్పకవీయమందలి పైరెండు చిత్రములే గాక ఇంకను అనేకములగు బంధకవిత్వ చిత్రములు ముగ్గులలో గలవు. సారస్వతమునకు, చిత్రలేఖనమునకు గల సంబంధమేగాక, ఒక కళకు మరియొక కళకు గల సంబంధమెట్టిదో ఈ ముగ్గులయందలి విశేషములు ఋజువుపరచుచున్నవి.

ధనుర్మాసము నెలరోజులు వీధులందు పైరెండు ముగ్గులనే గాక తమ కళానైపుణ్యముట్టి పడునట్లు అనేకరకముల చిత్రవిచిత్రములగు ముగ్గులతో నలంకరింతురు. ధనుర్మాసాంతమునకు దక్షిణాయనము పూర్తియై ఉత్తరాయనము ప్రవేశించును. దిక్కులలో దక్షిణమునకు యముడు అధిపతి. యముడు మరణకారకుడు. దక్షిణాయనమునందు వాతావరణము రోగవ్యాప్తికి దోహదమిచ్చునదిగా నుండును. ధనుర్మాసము దక్షిణాయనమున ఆఖరు మాసము. దక్షిణాయనము వర్ష, శరత్, హేమంత ఋతువులతో గూడియుండును. నేల నీటితోను, తేమతోను నిండియుండును. వాయువు శీతలముగ నుండి, తక్కువ ఉష్ణత, ప్రసరణగల సూర్యరశ్మితో నుండును. ఈ వాతావరణము సాంక్రామిక వ్యాధులుద్భవించుటకెక్కువ దోహదకారియై యుండును. ఈ సమయమునే యమదంష్ట్రకాలమందురు. ఇందే కోరల పున్నమ (మార్గశిర పౌర్ణిమ) కూడ వచ్చును. ఇది దాటినచో మరణము నతిక్రమించినట్లు ప్రజలు సంతసింతురు. ఈ క్రిముల సంహరించు తలంపుతోనే వీధులను గోమయచర్చితమొనర్చెదరు. ముగ్గులుంచు మగువలకు అది ముగ్గుల పండుగ; బాలికలకు గొబ్బిపండుగ.

ధనుర్మాసమందు ఇండ్లు వాకిండ్లు దులిపి వెల్ల (సున్నము) వేయించు గృహలక్ష్ములు కొందరు. జేగురుతోను, సుద్దతోను గోడలకు కూడ పట్టీల నలంకరించు వైష్ణవాంగనలు కొందరు. కడుపుకే లేనిది కొంపకు కూడ నెచ్చట తేగలమని పూతగోడలకు చీకాకుతో చిలుకుకొట్టి సంతృప్తిపడెడు కాంతలుకొందరు. ఎవరి శక్తి కొలది వారు నలంకరించి, గుమ్మములకు పసుపుపూసి, ముత్యముల వంటి ఎరుపు, తెలుపు చుక్కలుంచి గృహమునంతను పరిశుద్ధమొనర్చి, ఆరోగ్యకారియగు ఉత్తరాయనమునకు మకరసంక్రమణమందు ఆహ్వానమిచ్చుచున్నారు.

ఆరోగ్యప్రదమగు మకరసంక్రమణము ప్రవేశించగనే దక్షిణాయనమందలి అనారోగ్య ప్రకృతిని రథమెక్కించి సాగనంపుచున్నట్లు, భోగి, సంక్రమణము, కనుములు గడిచిన తరువాత ముక్కనుమరోజున రథము పెట్టి బైటకు లాగినట్లు, ముగ్గు కర్రతో రథమును లాగివేయుచున్నారు. (5 వ చిత్రము)

గోమయము, పసుపు, సున్నము, కుంకుమలు గృహాలంకరణమందు వాడుచున్నారు. గృహిణి అలంకరణమందు గోమయమునకు బదులు కాటుక, పసుపు, సున్న

(59-వ పేజీ చూడండి)

# ★ మేడమీద మఱ్ఱి ★

(15-వ పేజీ తరువాయి)

కామరాజు నిట్టూరుస్తూ రంగయ్యతో. ఓ గంటసేపు రంగయ్యతో రహస్యంగా మాట్లాడేడు. రంగయ్య కోపంతో వణికి పోతున్నాడు. రాయుణ్ని కాలితో నేలని పెట్టి రాచేయాలని చూస్తున్నాడు. ఊళ్లో మెరకవీధి కొత్తూరు తన తరఫున ఉన్నా నిర్భయంగా రాయుడింత పనిచేయించాడు. ఇంకేం చెప్పాలి ? ఉఁహూ !

"అంతే ఆపనే చేయించాలి. తర్వాత ఏం జరిగినా సరే." అన్నాడు కామరాజు. "అంతే" అన్నాడు రంగయ్య.

పదిగంటలైంది. భయంకరంగా ఉంది చీకటి. కామరాజు ఇంటికి పోతున్నాడు రంగయ్య వద్దనుంచి. అతనికి అన్నీ అనుకూలిస్తున్నయ్. గడ్డిమేటు తగలబెట్టించింది రాయుడని అందరూ నమ్మేసేరు. అందుకేగా అసలు తను ఆపని చేయించింది! రంగయ్యకు రాయుడెంత దూరమైతే, తను అంతదగ్గరపడతాడు. రాయుడు ఎంత అడుక్కిపోతే తను అంత పైకి వస్తాడు. అంతా అనుకూలిస్తుంది. ఇంక తన కూతుర్ని రంగయ్య మేనల్లుడికిఇస్తే...

మరో మూడురోజులు గడిచాయి. ఈసారి ఊరికి ఉత్తరంవైపున మంట కనబడింది. రాయుడిపాక కాలిపోయింది. పాలికాపు తాటిచెట్టుకు విరిచి కట్టబడి ఉన్నాడు. తెంపుకుపోయినవి పోగా ఒక ఎద్దు, రెండు గేదెలు వికృతంగా పొట్టలు పగిలి చచ్చిపడిఉన్నయ్. "ఎవరో పాతేత్తాను" అన్నాడు రాయుడు కాలిపోయిన పాకదగ్గర నిలబడి.

"నా మేటు తగలెట్టించినవాడి రత్తం తాగుతాను." అన్నాడు రంగయ్య, ఇంటి అరుగుమీద నిలబడి.

అందరూ రాయుడిపాక ఆర్పడానికీ, చచ్చిన పశువుల్ని చూడ్డానికీ వెళ్లారు. ఇంతలో పల్లపువీధిలో కోటయ్య ఇంటికి నిప్పంటుకుంది. అందరూ పరుగెత్తుకొచ్చేసరికి నాలుగిళ్ల వరకూ పాకిపోయింది మంట. చెరువులో నీరు అడుగంటి ఉంది. ఆర్పడం బ్రహ్మాండమైపోయింది. వీలయినంతవరకూ మంటలు కొత్తూరు, మెరకవీధి వెళ్ళకుండా ఆపుచేశాడు రంగయ్య.

ఊరంతా పీచుపీచు మంటూంది. ఎప్పుడే ఉపద్రవం ముంచుకొస్తుందో అని ఎదురు చూస్తోంది. మెరకవీధి కొకి పల్లపువీధికి రాదు. పల్లపువీధి కొకి మెరకవీధికి రావడానికి వీల్లేదు. పల్లపువీధిలో కమ్మర్లు మెరకవీధి గో వాళ్ళపనులు చేయరు. మెరకవీధివారి చాకళ్ళు పల్లపువీధివారి బట్టలుతకరు.

చెరువుగట్టుమీద రావిచెట్టుకింద పాకలోకి చెత్త చేరింది. రాయుడి దొడ్లో చింతచెట్టుకిందకు, రంగయ్య ఇంటి అరుగుమీదకు జనం కూడుతున్నారు.

రష్యన్లు జర్మనీ నాశనం చేస్తుంటే హిట్లరు పని ఎలాగుందో రంగయ్య పని అలాగుంది. ఊళ్లో పార్టీ గొడవలు ముమ్మరంగా ఉన్నయ్. ఇంట్లో కాంతం పెళ్లి గురించి గొడవ. సుబ్రదమ్మ ఇల్లు ఖాళీ చేసి స్వంతయింటికి పోడానికి ప్రయత్ని

స్తోంది. ఆమె కేదో నచ్చజెప్పి సముదాయించడానికి కూడ తీరిక లేదు రంగయ్యకు.

అత్తయ్య స్వంతయింటికి పోయేగోజున కాంతం పడుకుని లేవలేదు. బయటికి రాలేదు. మంచం దిగడానికే భయమేసింది. అత్తయ్య నాన్నతో దెబ్బలాడి ఇటు రావడం మానేసిన దగ్గర్నుండి కాంతం అటు పోలేదు. అలా వెళ్ళవద్దని ఎవరూ శాసించలేదు గాని ఆమెకు మాత్రం శాసించినట్టే ఉంది. సుబ్బారావునిగురించి తను ఊహించిన ఊహాలన్ని జ్ఞాపకం తెచ్చుకుంది. అత్తయ్య తనని ఎలా పిలిచేదో తనలో తనే అనుకుంది. ఆ వేళంతా కాంతం లేవలేదు. "అదేమే?" అంది రత్తమ్మ.

"ఏంలేదు" అంది కాంతం.

అత్తయ్య పోయేటప్పుడు ఏదో తీసుకుపోయింది. అందరూ కలసి కాంతం పసిహృదయాన్ని పిండేస్తున్నారు.

కాంతాన్ని చూసుకోడానికని నారాయణతో నలుగురు మగాళ్ళు మాత్రం వచ్చారు. "ఇదేంచిత్రంరా! మగాళ్ళ కెలా చూపించమంటావ్? మన్లో ఎక్కడైనా ఉందా ఇలాగ?" అంది రత్తమ్మ నోటిమీద చేయి వేసుకుని.

"ఇప్పుడు చదువుకున్నవాళ్ళంతా ఇంతే. మనం కాలాన్ని బట్టి నడుచుకోవాలి. అయినా పెళ్లి చేసుకునేది పెళ్ళికొడుకా? ఆడాళ్ళా?" నారాయణ అక్కను మళ్ళీ మాట్లాడనీయలేదు.

కాంతం ఇంట్లో వంటరిగా ఉండగా రామం వెళ్లి "నీకు బావని చేసుకోడం ఇష్టం లేదా?" అని అడిగాడు. కాంతం నిర్ఘాంతపోయింది. ఏమనాలో తెలియలేదు. తన యిష్ట మేముంది? ఇలా అడుగుతాడని తెలిసి ఉంటే ఆలోచించుకునేదేమో. "మాట్లాడవేం చెప్పు" అంటూ రామం దగ్గరకొచ్చాడు. కాంతం కళ్ళల్లో నీళ్లు కనబడ్డాయి తన చర్య తనకే అసహ్యమనిపించింది. మూర్ఖురాలైపోతూ డేం తను?

బలిపీఠంమీద కెక్కించే మేకలాగు, కాంతానికి, బెనారసు చీర కట్టి నగలన్నీ పెట్టింది రత్తమ్మ. పెళ్లివారు ముందువాల్లో కూర్చున్నారు. కాంతం వెళ్ళనని మొరాయించింది. రత్తమ్మ తలుపుచాటునుండి తోసింది. అక్కడ ఆడాళ్లున్నారో మగాళ్లున్నారో కూడా చూడలేదు కాంతం. ఆ కాస్తసేపు అగ్గిమీద నిలబడ్డట్టు నిలబడి బయటికొచ్చిం తర్వాత అమ్మని కౌగలించుకుని బావురుమంది.

"ఏమంటావోయ్?" నారాయణ రామాన్ని అడిగాడు

"అవును. ఇప్పుడైతే బి. ఏ. చదువుతున్నానని చెప్పుకోవచ్చు. తర్వాతయితే ఉద్యోగం దొరకలేదనో, గుమాస్తా ఉద్యోగమనో చెబితే ఇప్పుడొచ్చినంత కట్నం రాకపోవచ్చు." రామం చెప్పింది నారాయణకు అర్థం కాలేదు. నోరు తెరిచి చూస్తున్నాడు. "ఈ పెళ్ళి చెయ్యరని చెప్పు" అన్నాడు మళ్లీ.

# వేడమీద మట్టి

"అదేంట్రా!" అంది రత్తమ్మ.

"ఎందుకురా?" మెల్లగా తీక్షణంగా అడిగాడు రంగయ్య.

"ఏం లేదు. జరగకూడదు. అంతే." ఎన్నో కారణాలు చెప్పాలనుకున్న రామానికి ఉద్రేకంలో నోరు తిరగలేదు. సుబ్బారావు కిచ్చి చేయాలని వాడి ఉద్దేశం.

"ఏడిశావులే. బయల్దేరాడు పెద్ద." గదమాయించాడు రంగయ్య. అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. రంగయ్య బయటికి పోయాడు.

రంగయ్యకు చిరాకెక్కువయింది. ఏం చేయడానికి తోచడంలేదు. తను తప్పు దారిని నడుస్తున్నట్లనిపిస్తోంది. ఇంతనుందిని కాదని తను ఈ పెళ్లి చేయడమేనా? దాని మట్టుకది ఏడుస్తూంది. ఇల్లు వదలిపోయింది. ఇవతల ఈ చేను గొడవ అలాగే ఉంది. తనలాగే రాయుడు కూడ ఆశ పెంచుతున్నాడట, సుబ్బన్న చేలో ఊడ్చడానికని. మళ్లీ ఏపాక తగులబెట్టిస్తాడో! అయిన ఎనిమిది వందలరూపాయల ఎడ్లజత కనబడకుండా పోయింది. వెధవ ఏం చేయించాడో! ఎవడిచేతయినా శుభ్రంగా రాయుడిని చంపించేస్తే బాగుండేటట్లుంది. వాడు బ్రతికుంటే తనకు విశ్రాంతి అంటూ ఉండదు. ఎలా చంపించాలి? రాయుడి బుర్రతీసేయడం తన వల్లవుతుందా?

"నీచేను మంచి పనిచేస్తోందే!" వెటకారానికన్నా భరించలేకపోతున్నాడు సుబ్బన్న. ఎక్కడచూచినా "సుబ్బన్న చేను" అన్నమాటే వినబడుతోంది. పాలెం ఊరే "సుబ్బన్న చేను" "సుబ్బన్న చేను" అంటూ కూర్చుంది. అప్పులు పెరిగి తను ఏడుస్తుంటే ఇదొకటి పై పెచ్చు. కరణాన్ని కలిసికొని ఎంతకో అంతకి ఎవరికో ఒకరికి ఖాయం చేయమన్నాడు. 'సరే' అన్నాడు కరణం.

కాంతానికి జ్వరంగా ఉంది. రంగయ్య మంగలి నూకాలుకు కబురంపాడు. నూకాలు వచ్చి నాడిచూచి "పరవాలేదు బాబయ్యా, కొంచెం ఉష్ణంచేసిందంతే" అని మాత్రయిచ్చిపోయాడు. రత్తమ్మకి కొంచెం కంగారుగా ఉంది. "శుభమా అని పెళ్ళి తలపెడితే ఇదేవిటే" అంది. కూతురి తల నిమురుతూ "ఎలాగుందమ్మా!" అంది. ఎలాగుంది? ఏంబాధ? "ఎలాగూ లేదు" అంది కాంతం.

రామం వచ్చి "వాళ్ళకి ఉత్తరం రాసేశాను" అన్నాడు అమ్మతో. ఈ మధ్య అమ్మతో దెబ్బలాడుతున్నాడు రామం, ఈ పెళ్ళిచేయకూడదని.

"నాతో చెబుతావెందుకురా? మీ నాన్నతో చెప్పు."

"అక్కర్లేదు. నాన్నతో ఎందుకు? నువ్వొప్పుకుంటే నాన్న ఒప్పుకున్నట్టే" అంటూ గబగబాపోయాడు రామం.

రత్తమ్మ కాంతంవేపు తిరిగి "అలా చూస్తావెందుకే? ఎలాగుందో చెప్పమంటే చెప్పవేమమ్మా" అంటూ బుజ్జగించింది. కాంతం కళ్ళంట నీళ్లు తిరిగినయ్. "అదేం విటే?" నీళ్ళతుడవబోయింది. కాంతం తల్లి వడిలో తలపెట్టుకుని పొర్లుతూ ఏడ్చింది. "కొంపతీసి గాలా ఏమిటి? పడుకో వస్తాను." అని రత్తమ్మ కాంతానికి దుప్పటి కప్పింది.

రంగయ్య కొడుకు మీద ఎగురుతున్నాడు, తన యిష్టం లేకుండా వాళ్లకి ఉత్తరం రాసినందుకు. కొడుకు ఆవిధంగా రాస్తున్నాడని రంగయ్యకూ తెలుసు. ఏమనడానికి తోచక అప్పుడు ఊరుకున్నాడు. అయిపోయింతర్వాత తిరగబడ్డాడు. ఎంత తెలిసినా తన అధికారానికి లోపం వచ్చినట్లు కనబడింది. దాన్ని గురించి తనూ ఆలోచిస్తున్నాడు. తనే అలారాయమని చెప్పేవాడేమో. రాసే ముందు తనకి ఎందుకు చెప్పలేదు?

"యెదవ తెలివితేటలు సంపాదించావు ఎలాగయితేనేం" అన్నాడు కొడుకుని. "ఉత్తరానికంటె ముందుపోయి నారాయణతో చెప్పు అసలు వాళ్ళతో చెప్పవద్దని. ఫో." అరిచాడు రంగయ్య.

అంతకుముందే వచ్చి నిలుచున్న రత్తమ్మ "ఆచార్లు గారింటిదగ్గర్నుండి కొంచెం యీబూది తెప్పించండి. ఉత్తినే ఉలికి పడుతోంది" అంది.

"చావండి ఎలాగోలాగ" గబగబా బయటికి వెళ్లాడు రంగయ్య.

"బాబుగోరూ! కరణంగోరు రమ్మంటన్రు." కరణందగ్గర్నుండి కబురు. ఈ మధ్య ఇద్దర్నీ చెరిసగం ఏదో ధరకట్టుకు తిసికోమని రాయబారాలు జరుగుతున్నయ్. అందుకే అయిఉంటుంది. "ఊఁ! పద" అని బయలుదేరాడు. "సగం గిగం కుదరదు" లోపలే అనుకున్నాడు. కోపంతో అడుగులు జోరుగా వేస్తున్నాడు.

"ఎంతకైతే పుచ్చుకుంటావో ఒక్క మాటచెప్పు రంగయ్యా. రాయుడికంటె ఎక్కువంటే నీదే." అన్నాడు కరణం.

"ఆడెంతన్నాడు?"

"రాయుడినింకా అడగలేదు. అడిగినా ఎలా చెబుతాను? ఇద్దర్నీ అడుగుతాను. ఎవరెక్కువంటే వారిదే. ఏం చెంచయ్యా?" రంగయ్య ఇంటిదగ్గర్నుండే వచ్చాడు చెంచయ్య అప్పుడే.

"ఉఁహూఁ! అయితే నాకా చేనే వద్దు." గిరుక్కున తిరిగాడు రంగయ్య. చెంచయ్య రంగయ్యతోబాటు జోరుగా నడుస్తూ "మాంచి పనిచేశావు మామా. అంత దరకైతే దండుగే." అన్నాడు.

కరణం రంగయ్యని ఎంత ఇంటికి పిలిపించి అడిగినా ఈ సంగతి రాయుడికి తెలియక పోలేదు. రంగయ్య ఎందుకు వద్దన్నాడా అని ఆలోచించాడు రాయుడు. అసలావార్త నిజమా కాదా అన్నాడు. "కరణం ఇంట్లో పనిచేసే గొల్లది చెప్తేనే" అన్నాడు కోటయ్య. అయిదేళ్ళ కుర్రాళ్లు కూడ ఈ విషయాలు శ్రద్ధగా వింటున్నారు. పెద్దాళ్ళతో చెబుతున్నారు.

కరణం ఈసారి రాయుడికోసం కబురంపకుండా తనే వెళ్లాడు. "అనవసరంగా పోటీ ఎందుకు రాయుడూ. ఇంత ఇస్తానని చెప్పు. నీ పేర రాయించేస్తాను." అన్నాడు.

"నాకు ఎంతకైనాసరే వద్దండి." వెంటనే అనేశాడు రాయుడు. కరణానికిదంతా కలలా తోచింది. వెర్రిగా చూస్తూ గుటకేశాడు. నోట్లో తడి ఆరిపోయి గుటక పడలేదు.

పెళ్ళివిషయంలో కామరాజు రంగయ్యను మళ్ళీ కదిపాడు. రంగయ్యకేం చెప్పాలో తెలియలేదు. "ఏదీ? మనం ఈ గొడవలో పడిఉన్నాం. అది కోపగించి పోయింది. ఇంకా మాట్లాడలేదు" అన్నాడు. ఈ పెళ్ళి తప్పకుండా జరుగుతుందని కామరాజుకు నమ్మకం ఉంది. జరిగేలా చేయగలడు. చేస్తాడుకూడ.

పే అన్నం ఉడికేవరకు పొయ్యి ఆరియడదు. ఆరిపోతుంటే ఇంకో పుల్ల పెట్టాలి. రంగయ్య ఎడ్లజత ఎలా పోయిందో తనకి తెలియకపోయినా, తన రొట్టె చేతిలోకే దొర్లింది. పూజారోరి మాన్యం రంగయ్య రాయించుకున్నాడు కదా! పది సంవత్సరాలనుండి కవులు లేకుండా అది రాయుడు చేస్తున్నాడు. పన్ను కూడ రాయుడే కడుతున్నాడు. ఇప్పుడు చేను కూడ నాదే అంటున్నాడు. రంగయ్యచేత కాగితం రాయించి కోర్టులో పడేస్తే కనీసం అయిదు సంవత్సరాలవరకు పొయ్యి మండుతుంది. ఈలోపున అన్నం ఉడకదూ?

రాయుడి దొడ్లో చింతచెట్టు కింద మీటింగు జరుగుతోంది. "పాపం! అబ్బాయి బాగా ఎక్కించి అంట గలుపుదామనుకున్నాడు కాబోలు!" ఈసడించాడు రాయుడు.

"దాని మాటకేం గాని, పూజారోరి మాన్యం గురించి దావా పడేత్తాడంట" అన్నాడు కోటయ్య.

"పడేయనియ్. అదీ మాద్దాంగా."

కోటయ్య బావమరది గబగబ నడచి వచ్చి "సుబ్బన్న చేను కొమరాజు కొనేసేడట" అన్నాడు వగర్చుకుంటూ.

"ఎవరన్నారు?"

"ఎవరో అనేదేంటి? రాంకో వెలమీద కూర్చునికరణం అగ్నిమెంటు రాస్తుంటేను" అన్నాడు.

"ఎంతకి?" కోటయ్యడిగాడు.

"ఎకరం సంచి రూపాయలంట."

"ఆఁ!" రాయుడు బుర్ర పైకెత్తాడు.

"అద్గలాగుండాలి యవ్వారమంటే." అన్నాడొకడు, కొమరాజు వ్యవహార జ్ఞానాన్ని పొగుడుతూ. రాయుడు వాడి వంక ఓసారి చూచాడు.

ఈ విషయం గురించి రంగయ్య ఏమనుకున్నా పైకి మాత్రం "బలే పని చేశావ్" అన్నాడు.

"ఊడ్చడానికి ఆకు చాలదేమో. తలవని తలంపుగా వచ్చింది. నీదగ్గరేమయినా..." కొమరాజు మాట పూర్తి చేయక ముందే రంగయ్య "అలాగేలే" అని గబగబ నడుచుకుంటూ ఇంటికెళ్ళాడు. వాకిట్లో మంచం మీద కూర్చున్నాడు. చీకటి పడుతోంది. కాంతాన్ని పిలిచి నీళ్లు తీసుకురమ్మన్నాడు.

కాంతం నీళ్ళు తీసుకురాలేదు. దానికి జ్వరం తగ్గింది. కాని పూర్వంలా ఉండడం లేదు. కూర్చున్న చోటే కూర్చుంటుంది. మాట వినిపించుకోదు. పరధ్యానం ఎక్కువైంది. ఎవరూ లేనప్పుడు సుబ్బమ్మగారుండే వేపుకు వెళ్లి ఇటూ అటూ తిరిగి వస్తుంటుంది.

రామం పట్నం ప్రయాణం కట్టాడు. నాన్న తనతో మాట్లాడ్డం లేదు; అమ్మయినా అవసరమైతేనే. ఊళ్లో వందగొడవలు. ప్రతిదానికీ పట్టుదలే. పూజారి మాన్యం గురించి నాన్న దావా వేస్తాడట. ఆ చిక్కుల్లో ఉన్న చేను రాయించుకోడం ఎందుకని చెప్పేవారు లేకపోయారు. సంబంధం కలుపుకోడానికని కొమరాజు చూస్తున్నాడు. నాన్నని ఊరుకోనివ్వడు. నాన్నకి అసలే కోపం. ఏం చేస్తాడో? ఎద్లు దొరక లేదు. వెదకడాని కెంత ఖర్చవుతుందో?

"అప్పుడే ఎందుకురా?" అంది రత్తమ్మ.

"మళ్ళీ దసరాకు వస్తాను" అన్నాడు. అత్తయ్యతో చెప్పడానికని బయలుదేరాడు. అత్తయ్య ఇల్లు మారి ఇంచుమించు నెలకావస్తున్నా ఒక్కసారికూడ వెళ్ళలేదు. శరీరం బరువుగా కదుల్తోంది. కళ్ళు దిక్కులు చూస్తున్నయ్.

అత్తయ్యను చూడ్డంతోనే చేతుల్తో ముఖం కప్పుకుని మంచంమీద కూలబడి, తల మోకాళ్ళమీద ఆన్చి ఏడవడం మొదలెట్టాడు. "రోజులు అలాగున్నయ్యంతే నాయనా" అంటూ రామం చేతులు పట్టుకుని వారించబోయింది. చేతులు వణకినయ్. చెంగుతో తనముఖం కప్పుకుంది.

"ముఖం కడిగేసుకో." సుబ్బారావు చెంబుతో నీళ్ళు తెచ్చి దగ్గర పెడుతుంటే, వాడి ముఖంలోకి చూచాడు రామం. మామూలుగానే ఉంది. తెలియకా? ధైర్యమా? అత్తయ్య ఏదో అంది. "మళ్లీ దసరాకువస్తా" అన్నాడు.

రంగయ్య మూడువందలు లెక్కపెట్టి తీసి పందిరి మంచం పరుపు మీద పెట్టి బయటికి వచ్చాడు. రామం వెళ్లి అవి జేబులో వేసుకున్నాడు. సుబ్బారావు బండికట్టి వీథిలో నిలబెట్టాడు. వీథిలోకి వస్తూ అరుగుమీద నున్న రంగయ్యతో "దసరాకొస్తాను." అన్నాడు. "ఊఁ!" అన్నాడు రంగయ్య.

బండి నడుస్తోంది. మనస్సు వెనక్కి లాగుతోంది. ఇంకా ఇరవైరోజులుండగా అప్పుడే ఎందుకు బయలుదేరానా అనుకున్నాడు. ఓ డజను కార్డులమీద తన యడ్రసు వ్రాసి సుబ్బారావు కిస్తూ "ఊళ్లో ఏం జరిగినా రాస్తావుకదూ" అన్నాడు. అది తీసుకునేముందు సుబ్బారావు చేతిమీద ఒక కన్నీటిచుక్క రాలింది.

"ఇంకా కుర్రాడివా? ఎందుకదీ అసలు?"

తొణ్గొంచి కొంచెం వెనక్కి జరిగాడు సుబ్బారావు. పన్నెండుగంటలయింది. ఎండ తీక్షణంగా కాస్తోంది. ఎద్లు వగర్చుకుంటూ నడుస్తున్నయ్. సుబ్బారావు చేతులు పట్టుకుని జలజల కన్నీరు కార్చాడు రామం. ★

## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు వానిని త్రిప్ప పంపగోరినట్లయితే, రచనలూ చిత్రాలతోపాటు అవసరమైన స్టాంపులను గాని, స్టాంపులు అంటించి చిరునామా వ్రాసిన కవర్లను గాని చేర్చి పంపవలసిందని మనవి. స్టాంపులను పంపేవారికి మాత్రమే వారి రచనలను గాని, చిత్రాలను గాని ప్రచురించే ముందు ప్రచురణ విషయమై తెలియపరచగలము. ఈ సందర్భంలో రచయితలు, చిత్రకారులు మాకు సహకార మివ్వగలరని ఆశిస్తున్నాము.

"భక్తుడా! మెచ్చితిని లెమ్ము" అంటోంది శ్రీమతి అంజలి, [illegible]
"పరదేశి"లో స్లోమోషన్ నృత్యంలో విశ్రాంతి తీసుకుంటున్నారు నాయకీ నాయకులు

# ★ సినిమా వార్తలు ★

రాజా ప్రొడక్షన్సువారి "పుట్టిల్లు" షూటింగ్ దాదాపు అయిపోయినట్లేననీ, ఇంకా కొన్ని చిన్న చిన్న దృశ్యాల పనిమాత్రమే మిగిలివుందనీ తెలుస్తోంది. ఫిబ్రవరిలో నే విడుదల చేయాలని నిర్మాతలు ఆయత్తమవుతున్నారు. వీరు ఇటీవల తీసిన "పొట్టి శ్రీరాములుగారి పూర్ణాహుతి" హ్రస్వ చిత్రంలోని కొంత కామెంటరీని, ఆఖరి పద్యాన్ని హిజ్ మాస్టర్స్ వాయిస్ వారు రికార్డు చేసుకున్నారట (ఈ పద్యం సుంకర, వాసిరెడ్డిగార్ల రచన; నాజర్ పాడాడు) పై హ్రస్వ చిత్రం తాలూకు కాపీలు 80 పైగా అమ్ముడుపోయినట్లు తెలుస్తోంది.

* * *

పృథ్వీరాజ్ కపూర్ విజయవాడలో ఈ నెల 21 నుండి 26 వరకూ 5 నాటకాలు ప్రదర్శించనున్నాడు. వీటి పేరు. "దీవార్", "గద్దార్", "పఠాన్", "ఆహుతి", "కళాకార్" ఈ నాటకాలలో భారత స్వాతంత్ర్య ఉద్యమం, హిందూ ముస్లిం ఏకత, సంఘంలో కళాకారుని కర్తవ్యం మొదలైన విషయాలు హృద్యంగా చిత్రించబడతాయి. పృథ్వీరాజ్ దక్షిణదేశ పర్యటన అనంతరం బొంబాయి వెళ్లాక తన నాటకాలను సినిమాలుగా తీసే విషయమై ఏర్పాట్లలో నిమగ్నుడౌతాడని తెలుస్తోంది.

* * *

లండన్ వారపత్రిక "న్యూ స్టేట్స్‌మన్ ఎండ్ నేషన్" గత సంవత్సరం విడుదల అయిన చిత్రాలను సమీక్షిస్తూ చార్లీచాప్లిన్ తీసిన "లైమ్‌లైట్"కు మొదటిస్థానం, జపానీస్ చిత్రం "రషోమోన్"కు రెండవ స్థానం ఇచ్చింది. (రషోమోన్ సమీక్షకై 8-12-52 ఆంధ్ర వారపత్రిక చూడండి)

భానుమతి దర్శకత్వాన తయారవుతున్న త్రిభాషా చిత్రం "చండీరాణి" మూడింట రెండువంతులు పూర్తయిందట

* * *

ఇంగ్లీషు, హిందీ భాషల్లో తయారించబడిన "ఝాన్సీకీరాణీ" టెక్నికలర్ చిత్రం ఈ నెలాఖరులోగా విడుదల కావచ్చునట.

* * *

గత సంవత్సరం విడుదల అయిన హిందీ చిత్రాల్లో న్యూ థియేటర్సు వారి "యాత్రిక్", దేవకీబోసు తీసిన "రత్నదీప్", బొంబాయి టాకీస్ వారి "మా" విజయభట్ తీసిన 'బైజూబావరా' చిత్రాలు ఆర్థికంగా విజయవంతమైన వాటిల్లో అగ్రగణ్యములని అభిజ్ఞుల అంచనా



# త్వరలో విడుదల!



శ్రీరంజని • సావిత్రి • సూర్యకాంతం • హేమలత •
నాగేశ్వరరావు • రంగారావు • రేలంగి • వెంకట్ •
రావులపల్లి • పార్థసారధి •
నటించిన,

భాస్కర్ ప్రొడక్షన్సు చిత్రం

# బ్రతుకు తెరువు

డైరెక్షన్
## రామకృష్ణ

పాటలు మాటలు— సముద్రాల — సంగీతం— కే. శే. సుబ్బరామన్ • ఘంటసాల—
ఛాయ.... కమల్ ఘోష్ — కళ— టి. వి. యస్. శర్మ.... స్టూడియో— నరసూస్—

ఆంధ్ర - ప్రీమియర్ ఫిలిమ్సు లిమిటెడ్ • సీడెడ్ - నవయుగ ఫిలిమ్సు • నైజాం - ప్రీమియర్ పిక్చర్సు •
వివరములకు :- భాస్కర్ ప్రొడక్షన్సు... మద్రాసు..17..

# ముగ్గులు

(51-వ పేజీ తరువాయి)

మునకు బదులు గంధము వాడుచుండుట గాంతుము. వివాహమందలంకరించు నాక బలిపట్టు కూడ—గోమయముతో స్థలమును శుభ్రపరచి, పసుపు, సున్నము (లేక వరి పిండి), కుంకుమ (లేక పారాణిపొడి)లతో చిత్రింతురు. నాకబలిపట్టుపై పెట్టు సజ్జకూడ నలుపు, తెలుపు, ఎరుపు రంగులతో లేపనము చేయుదురు. వివాహమునందు వధువునకు పసుపు, కుంకుమలతోబాటు బంగారము (పసుపు)తో తయారుచేసిన మాంగల్యము; వెండి (తెలుపు)తో చేసిన మట్టియలు; నల్లపూసలు (నలుపు) విధిగా గృహిణి అలంకరించుకొని ముత్తైదువుగా జీవితాంతమువరకు యుండవలెననెడి తలంపుతో అలంకరించుచున్నారు. పై విషయముల సమన్వయించి చూచిన సున్నము, పసుపు, కుంకుమ, గోమయములందు ఆరోగ్యసూత్రములే గాక, ఆధ్యాత్మిక భావములుగూడ ఇమిడియున్నట్లు తెలియుచున్నది.

చక్రహస్తుని ప్రకటించు చదువె చదువు. ఆధ్యాత్మిక దృష్టిలేని విద్యగాని, కళగాని, తుదకు ఎట్టి సాంప్రదాయముగాని హైందవులలో లేదు. చిత్రలేఖనము, ముగ్గుల రచనలందలి ఆధ్యాత్మిక భావ మెట్టిది? తెలుపు, పసుపు రంగులు సాత్వికమును, ఎఱుపు రజోగుణమును, నలుపు తామసభావమును తెలుపును. పై పదార్థముల రంగులందు ఈ మూడు భావములే గోచరించుచుండును. ఈ మూడు భావములు స్ఫురించు రంగులనే ప్రపంచ విఖ్యాతి గాంచి, హైందవ చిత్రకళకు ఆదర్శమైన అజంతా చిత్రలేఖనమందుకూడ ముఖ్య వర్ణములుగా వాడినట్లు పరిశోధకులు తెలుపుచున్నారు.* సత్త్వ రజ స్తమో గుణాత్మకమగు ప్రకృతిని ("అజా మేకాం లోహిత శుక్లకృష్ణాం। బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపాం॥—శ్రుతి") సేవించి, అట్టి ప్రకృతిని స్వేచ్ఛగా స్వీకరించిన నీలమేఘ (నలుపు+ఎరుపు+తెలుపు=నీలిరంగు) శరీరుడగు పరమాత్మను జేరవలయునని తెలియజేయుచున్నవి.

ఆరోగ్య ఆధ్యాత్మిక విషయముల మేళవించి, ప్రతివ్యక్తి కొద్దియో గొప్పయో కళానైపుణ్యము గలిగి చిత్రకళా సౌధాగ్రమున నిలచి కళారాధన చేయవలెనని ఋషివర్యులు ప్రబోధించిరి.

"కాలానాం ప్రవరం ధర్మ<br>
కామార్థ మోక్షదమ్।<br>
మాంగల్యం ప్రథమం హ్యేతత్<br>
గృహే యత్ర ప్రతిష్ఠితమ్॥"<br>
—మార్కండేయః.

* "The colours used in the original painting are three only....RED-OCHRE, LAMP-BLACK, AND WHITE OF LIME. I may also mention here parenthetically that the colours used by the artists of Ajanta were principally earth-colours obtained locally except lapis-lazuli, which they have used for the blue tint and which was obtained from North-West India." —THE WALL PAINTINGS OF AJANTA, BY G. YAZDANI, O. B. E.

# ★ మూలిగే నక్కలు ★

(81-వ పేజీ తరువాయి)

పో: ఏదో మొగుడూ పెళ్లాలయాక కీచులాడకుండాను ఉండరు, కలుసుకోకా ఉండరు. మొగుడయింతర్వాత స్వంత పెళ్లానికి బుద్ధిచెప్పుకోడానికి కాస్త చేయి చేసుకున్నంతమాత్రంచేత మీరు పిల్లను తీసుకురావడం అట్టే సమంజసమంటారా బావగారూ?

శ: పిల్ల వాళ్లు పెట్టే బాధలకు ఏట్లో పడబోతుంటే ఇరుగూపొరుగూ చూసి తోడిచ్చి పుట్టింటికి పంపారు.

పో: అబ్బాయి అమ్మాయి మీద కారాలూ మిరియాలూ నూరడాని కేదన్నా కారణం.

శ: ఏముంటుంది. మూడు ముళ్ళూ పడేటప్పటికే ఉన్నదంతా ముక్కలయింది. ఒచ్చేజీతం ఒక్కపూటకే కనాకష్టంగా ఉంటే ఆమహానుభావుడికి మహారాజభోగాలు వెలిగించలేదని అలిగి పిల్లనిపీక్కు తింటాడు.

పో: అద్దదీ! ఊరికే అన్నారా అల్లుళ్లని దశమగ్రహాలని.

శ: ఏలినాటి శని ఏడేళ్లేకాని దశమగ్రహం పట్టిందా చచ్చేదాకా ఒదలదు.

పో: అయిందేదో అయిపోయింది. ఈ పాటిదానికింత రాద్ధాంతం చేయడం అతనికే బాగులేదు. పిల్లనిచ్చినవారు కనుక నిమ్మకి నీరెత్తినట్టూరుకోవడం మీకూ బాగులేదు. నామాట విని ఏదో సర్దిచెప్పి పిల్లని—

శ: ఏం సర్ది చెప్పేది. పిల్లకి అత్తారిల్లంటేనే బెదురుపట్టుకుంది.

పో: అలాఅంటే ఎలా. ఇంతకీ పిల్లకి వచ్చి ముంతదాచడండేనికి. ఈవ్యవహారం ఏదోవిధంగా తేలకపోతే సమ్మంధాలు తేవటం నాచేతకాదు సుమండీ—

శ: ఏం చేస్తాం. వాళ్లరాత ఎలాగుంటే అలాగవుతుంది.

(కాంతమ్మ తెరలో. కాఫీతయారయింది తెమ్మంటారా)

పో: ఎందుకమ్మాయి నీకంత కష్టం. నేనే వచ్చి తాగిపోతాలే. రండి బావగారూ.

శ: (నిట్టూర్చి) మీరు తాగిరండి. నాకిప్పుడు తాగాలని లేదు.

పో: అబ్బెబ్బే. మీరు లేకుండానా.

శ: ఫరవాలేదు. వెళ్లిరండి. (పోతరాజు పోతాడు. శరభయ్య ఉస్సురంటూ దిగాలుబడి చూరు చూస్తుంటాడు. కాస్సేపటికి పోతరాజు, కాంతమ్మ తిరిగి వస్తారు.)

పో: బావగారూ, నే పోయివస్తా. నే చెప్పిన విషయంమాత్రం గట్టిగా ఆలోచించండి. అమ్మాయి నీవుకూడా ఒక్కమాట చెవినివేయి. (పోతాడు.)

కాం: అయితే ఇదికూడా సున్నా అయిందటగా!

శ: (నీరసంగా) ఆ!

కాం: ఇక పెళ్ళిబేరాలు వచ్చే ఆశకూడా లేదటగా!

శ: (విసుగ్గా) నిజమే కావచ్చు.

కాం: మరి ఏమాలోచించారూ?

శ: ఆలోచించడాని కేముంది కనక.

కాం: బంగారమంటి సమ్మంధం. పిల్ల నచ్చితే కట్నాలూ కానుకలూ అక్కర లేదన్నారు కూడా.

శ: అయ్యుండొచ్చు.

కాం: పిల్లకూడా నచ్చిందట.

శ: నచ్చే ఉండొచ్చు.

కాం: అయినా సంమ్మంధం చెడిసింది. కారణంకూడా చెప్పాడు.

శ: చెప్పే ఉండొచ్చు.

కాం: ఏం వెటకారమండీ.

శ: మాటాడితే మారా మేకులాగుంది.

కాం: మాటాడమన లేదు మిమ్మల్ని.

శ: సరే మానేస్తాను.

కాం: (కోపంతో) పనిచేసి చూపించమంటున్నా.

శ: ఏంపని?

కాం: చెయ్యరాని దేంకాదు. పెద్ద పిల్లని – అత్తారింటికి –

శ: కసాయివాడికి మేకని తోలినట్టు తోలమంటావు.

కాం: ఇప్పటికే నలుగురూ నోట్లో గడ్డిపెడుతున్నారు.

శ: నోరుముయ్యవే ఛటాచోర్! ఈ గడ్డిపెట్టే వెధవలంతా దారిద్ర్యదోషంచేత 14 ఏళ్ళ కుంకని 40 ఏళ్ళవాడికి కట్టబెట్టే ముందు సాయం చేయకపోయారూ. తల్లిదండ్రులు సంఘభయంచేత చేసిన తప్పుకు, హిందూసంఘంలో పుట్టిన పాపమాత్రంచేత, ఆ దౌర్భాగ్యుడు ప్రసాదించిన రోగాలతో కుళ్లుతూ, వాడు ఒళ్ళు హూనం చేస్తుంటే నా బిడ్డ అలమటిస్తున్నప్పుడు, ఈ గడ్డిపెట్టే వెధవలంతా ఏమయినారూ? దాని ఇష్టానికి వ్యతిరేకంగా దాన్ని అత్తారింటికి పంపను నేనున్నంతకాలం కలో గంజో తాగుతూ ఇక్కడే పడిఉంటుంది.

కాం: ఉపన్యాసం బాగానేఉంది కాని, మీ తరువాత ఏం చేస్తుంది.

శ: నా తరువాతా! నా తరువాత – (తల గోక్కుంటాడు.)

కాం: మీరు వెనకేసిన వెండిబంగారాలు కరిగించుకు తింటుందా?

శ: ఏ పనోపాటో చేసుకుంటుంది.

కాం: వంటపని తప్ప దానికేం చేతవును. స్వంతింట్లో మొగుడితో తన్నులు తింటంకన్నా పరాయింట్లో చాకిరీచేసుకు చీవాట్లూ చెప్పుదెబ్బలూ తింటం మంచిదా?

శ: అదేనయం. స్వతంత్రంగానన్నా బ్రతుకుతుంది.

కాం: ముండా స్వతంత్రంలే. బ్రతుకు చెడి పుట్టింటికిచేరిన ఆడది చెల్లని కానీ లాటిది. నామాట విని మరియాదగా పిల్లని అత్తారింటికి పంపండి.

శ: సవతి తల్లివి కనుకనే పిల్లని ఒదుల్చుకుందామనుకుంటున్నావు.

కాం: మీరింతసేపు పెద్ద పిల్లనే పట్టుకేడిస్తే తతిమ్మా వాళ్ళగతేం కాను. పెళ్లాం చచ్చినప్పుడు పెళ్లిమానెయ్యక పోయారా?

శ: మానేయవలసింది. అప్పుడు కళ్లు బైర్లు కమ్మాయి.

కాం: (ఒళ్ళుమండి) చెట్లలా ఎదిగిన కూతుళ్ళని నెత్తిమీద కుంపట్లలా పెట్టుకు పల్లెలో మసలడం ఎంత బాధో మీకేం తెలుసు? నలుగురి దెప్పుళ్ళూ పడలేక బయటికి వెళ్ళడానికి తలకొట్టేసినట్టుంటోంది. అందులో లేని వాళ్ళంటే అతిలోకువమాటలంటారు. నే పడలేనబ్బా ఈ దెప్పుళ్ళు. మీరు మీ అమ్మాయిని అత్తారింటికి పంపితే పంపండి లేకపోతే—

శ: లేకపోతే?

కాం: మీరు మీ అమ్మాయీ కలిసి ఈ ఊళ్లో ఉట్టిగట్టు కూరేగండి, నాపిల్లలతోనే పుట్టింటికి పోతా.

శ: ఫో. అక్కడేముంది మింగడానికి.

కాం: నారు పోసినవాడు నీరు పోయక పోడులే.

శ: పోస్తాడు – పోస్తాడు. వెళ్లు-ముహూ బాగా వెళ్ళు.

ప్ర: (ప్రవేశం కోపంతో) ఎందుకలా గొంతు చించుకుంటున్నారు? మీమాటలన్నీ విని అక్కయ్య వంటింట్లో కుమిలి కుమిలి ఏడుస్తున్నది.

కాం: ఏడవనీ – వచ్చిన నష్టమేం లేదులే.

 

# మూలిగే నక్కలు



శ : పుండుమీద కారం చల్లినట్లామాట లేమిటి?

కాం : ఎద్దుపుండు కాకికి నొప్పా, మీకెంతసేపూ మీ పెద్దకూతురు గోడే. మేమంతా చచ్చామా ఏం.

ప్ర : బ్రతుకు చెడితే కన్నవారుకూడా పగవారే అవడానికి. మొగాడైతే గాది క్రింద పంది కొక్కును మేపినట్లు మేపుతారు చచ్చేదాకా ఎన్ని బాధలు పడలు చేసినా.

కాం : నోరుముయ్యి భడవా న్యాయం చెప్పొచ్చావు. న్యాయం ఇదుగో! ఇప్పుడే చెబుతున్నా. ఇవ్వాళ అదయినా అత్తారింటికి పోవాలి. నువ్వైనా పోవాలి. అంతే—

ప్ర : మీరెందుకు కీచులాడుకుంటారు. అక్కయ్య ఎలాగూ అత్తారింటికి పోతానంటోంది మీరు అస్తమానం దెబ్బలాడుకుంటే చూడలేక. ఇక ఉండదట.

శ : కళ్ళు చల్లబడ్డాయా నీకు. వాడు మళ్ళీ చావగొడితే—

ప్ర : ఏసురొచ్చో గోడొచ్చో చూసుకుంటుందటగాని తిరిగి రాదటలే. వెళ్ళమ్మా వెళ్ళు! నీ మొగుడు కొట్టినా, తిట్టినా, పీక పిసికి చంపినా కిమ్మనకుండా పడమనీ, మొగుడి చేతిలో చెళ్ళం చస్తే కైలాసం సిద్ధిస్తుందనీ, దానికి ఇటు ఏడుతరాలవారినీ అటు ఏడుతరాలవారినీ, భగవంతుడు పీకకి తాడేసి అమాంతం బొందితో స్వర్గానికి చేరేస్తాడనీ, పతివ్రతాధర్మాలు నూరిపోసి మరీ పంపు అదుగో! అది గుండె పగిలేట్టు ఎలా ఏడుస్తున్నదో మీరు మనుష్యులు కారూ రాక్షసులు (లోపలికి పారిపోతుంది.)

శ : భగవంతుడా! ఇంకా ఎన్నాళ్లు ఈ బ్రతుకు బరువు మోయడం. (నిట్టూరుస్తాడు.)

## 2

(అదే ఇల్లు, 7, 8, నెలల తర్వాత. కాంతమ్మ కాఫీ ప్లేట్లు తీస్తుంటుంది.)

కా : (విసుక్కుంటూ) మండా కాఫీ ప్లేట్లు. రోజుకి 4 సార్లు అవచ్చే నాలుగు రాళ్ళు కాఫీకయ్యడమే కనిపిస్తుంది. వీటికి అంతెప్పుడో.

శ : (ప్రవేశం పై మీద కండువాతో చెమట తుడుచుకుంటూ)

కాం : (ఆదుర్దాగా) ఏమండీ! పెళ్లివా లేమన్నారు?

శ : పిల్ల నచ్చిందట.

కాం : నచ్చకేం చేస్తుంది. మరి చేసుకుంటానన్నారా?

శ : ఆ!

కాం : కట్నాలూ, కానుకలూ—

శ : ఏముంది. వెయ్యిన్నూటపదహార్లు!

కాం : అమ్మయ్యో!

శ : 500 లాంఛనాలు ఆడబడుచు కట్నాలు.

కాం : బాబోయ్!

శ : వెండిచెంబు వెండిపళ్లెం పట్టుబట్టలు.

కాం : చచ్చాం!

శ : చివర కదేలాగూ తప్పదులే.

కాం : ఏం మాటలనీ! పోనీ పిల్లా డేమన్నా చదువు సంధ్యా—

శ : ఓ! స్కూలు ఫైనలు 8 సార్లు తప్పాడు.

కాం : సరి - పోనీ - ఉద్యోగం ఏదైనా—

శ : లేకేం. నిక్షేపంలాంటి ఉద్యోగం. కోమటికొట్లో గుమాస్తా.

కాం. బాగానే ఉంది. పోనీ పనళ ఎవరైనా—

శ : ఉండకేం - తల్లి, తండ్రి, 4 గురు అప్పచెల్లెళ్లు.

కాం : ఈ మాత్రపు గొప్పకేనా వెయ్యిన్నూటపదహార్లూ?

శ : ఇప్పటికి వచ్చిన వాళ్ళల్లో వీళ్ళే తక్కువ అడిగారు.

కాం : పిల్లవాడైనా ఏమంత గొప్పవాడు కాదు. అమ్మాయికి నచ్చుతాడో లేదో.

శ . (విసుగ్గా) నీ కూతురేమన్నా మహారాజు కూతురనుకున్నావా స్వయంవరాలు చేయడానికి.

కాం : ఉన్నమాటంటే అలా కరవొస్తారేమండీ.

శ : అయితే వచ్చిన ఒక్క సంబంధాన్నీ కాదన్నమంటావా

కాం : ఏం స్థిరపరచారేమిటి?

శ : పెళ్ళి.

కాం : పెళ్ళా!

శ: అవును పెళ్ళే. చెప్పడా ఏం.

కాం: అది కాదండీ - మరి ఇంత డబ్బా ఎలా వస్తుంది. కొంప తీసి—

శ: కొంప పోసి కొంటేనే పుత్రవాడొచ్చాడు.

కాం: కొంపే!

శ: అవును. ఈ పంచ అమ్మకంతో పిల్లది ఇంట్లోంచి వెడుతుంది.

కాం: అయ్యో! ఈ కాస్త కొంప కూడా నెత్తిమీద ఆధారంగా లేకుండా పోతే—

శ: ప్రపంచంలో చెట్లకేమీ లోటు రాలేదుగా. పక్షులతోబాటు దిక్కుమాలిన పక్షులం మనమూ అక్కడికే పోదాం.

కాం: (నిట్టూర్చి) పోనీ ఇంకెక్కడున్నా—

శ: (విసుగ్గా) కన్నం వేయాలంటే. అర్ధాకలితో ఏళ్లు గడిపిన నాకు కన్నం వేసే బలం కూడా లేదు. ఒకవేళ సాహసించి చేసినా పట్టుబడి జైలుకు పోతే నా పొట్ట నిండుతుంది గాని మిమ్మల్నెవరు మేపుతారు?

కాం: బాగానే ఉంది మీ వరస - ఇంతకీ ముహూర్తం పెట్టించారా.

శ: వారంరోజులుంది.

కాం: అంత దగ్గరలోనా. పెద్దదానికి కబురంపండి. పెళ్ళికి ఉత్తరముక్కన్నా వ్రాసింది కాదేం.

శ: ఎందుకు వ్రాయాలి. పీకమీద చెయ్యేసి తోస్తివాయెను. ఒకవేళ వ్రాద్దామన్నా వాడు వ్రాయనిస్తాడూ. మొన్న చూడడానికి వడితే నేనిల్లేదని పిల్లనింట్లో పెట్టి తాళం వేసుకున్నాడు గదా! ఏకంగా ఒక్కసారే విందువుగాని లేచావు కబురు చల్లగా.

కాం: రామరామ! ఇవ్వాళ అన్నీ దరిద్రపుమాటలే వస్తున్నాయేం నోటంట?

శ: (నిట్టూర్చి) సంఘాని కెదురుతిరిగే త్రాణలేక గానుగెద్దులా జీవిత భారాన్ని మోసుకుతిరిగే గర్భదరిద్రుడికి ఇంతకన్నా మంచి మాటలెలా వస్తాయి.

కా: ఆడపిల్లల్ని కన్న దరిద్రులంతా మనలాంటి గుణదుష్టవంతులే. ఇంతకీ పుత్రాడు నచ్చకపోతే ప్రభ పెళ్ళికి ఒప్పుకుంటుందోలేదో. అసలే పెడసరపుది.

(ప్రవేశం ప్రభావతి కోపంతో)

ప్ర: నాన్నా! ఇప్పుడే చెబుతున్నా! ఇకమీద పెళ్ళిచూపుల వాళ్ళొస్తే నే చస్తే కనబడను, నేను సంతలో గుడ్డాన్నేం కాను. అడ్డమైనవాళ్ళు వచ్చి ఎముకలూ గూళ్ళూ పరీక్షించి కొంటానికి.

శ: అమ్మా! సంతలో గుడ్డాలేనయాం. డబ్బిచ్చికొనుక్కుపోతారు. ఆడపిల్లకి ఎదురిచ్చి కూడా కాళ్ళావేళ్ళాపడాలి.

కాం: ఇక పెళ్ళిచూపులవాళ్ళు రారులేవే.

ప్ర: పీడావదిలింది.

కా: చూడు ఈమధ్య నాల్గుసారులు వచ్చిపోయారు. నిన్న ఇవ్వాళా వాళ్ళ తాలూకు వాళ్ళొచ్చారుగా ఆ పెళ్ళికొడుకు ఎలాగున్నాడే?

ప్ర: ఓ! అద్భుతంగా ఉన్నాడు.

కా: (సంతోషంతో) అతనితో నీకు పెళ్ళినిశ్చయమైంది.

ప్ర: (అదిరిపడి) ఏమిటీ! ఆ పిల్లికళ్లు రాగిజట్టు, తారు రంగు మనిషితోనా?

కాం: ఏం చిత్రమే మరీని. అతనికేం నిక్షేపంలాగున్నాడు. కొద్దిగా నలుపు అంతేనా అయినా అందం మగవాళ్ళకెందుకూ?

ప్ర: అందం ఆడవాళ్ళకేనా కావలసింది?

శ: అవును తల్లీ. మగవాడు సంఘాచారాల పుణ్యమా అని వధువును ఏరుకుని చేసుకునే పరిస్థితిలో ఉన్నాడు.

ప్ర: నాన్నా! అతన్ని చేసుకోమంటం నీకు ధర్మంగా ఉందా?

శ: (నిట్టూర్చి) అమ్మా! ఇంటిపరిస్థితులు నీకు తెలియనివికావు. ఏడేండ్లనుంచి వెతకగా వెతకగా ఇది ఒక్కటేకుదిరింది. ఎంతకంతకే తృప్తిపడాలి.

కా: ఏం రాలుగాయ పిల్లతే మరీని నీకోసం కొండమీద కోతి నెక్కడ తెమ్మంటావు.

ప్ర: మీరు అక్షరాల కొండమీద కోతినే తెచ్చారు.

కాం: దీనికే కొంప కుండమయింది.

ప్ర: ఏం కొంపకేమయింది?

కాం: ఏమవ్వాలనివుందో అదే అయింది. కొంప అమ్మేశారు.

ప్ర: (విచారంగా) నాన్నా నా పెళ్ళి కోసం కొంపెందుకమ్మావు.

శ: (విసుగ్గా) లేకపోతే మంత్రాలకి చింతకాయలు రాల్తాయా! ఇంట్లో ఎర్రని ఏగానీకూడా ఉండదని నీకు తెలుసు. పెళ్ళెలా అవుతుంది? కన్నందుకు క్రిందబడో మీద బడో మాధర్మం నెరవేర్చక తప్పదు కదా.

ప్ర: ఎందుకు తప్పదు. ఉన్న ఒక్క కొంప నమ్మి నాకు పెళ్లి చేస్తే మిగతా వాళ్ళకెలా చేస్తావు.

శ: వాళ్లరాత ఎలాగుంటే అలాగవుతుంది.

ప్ర: రాతటరాత. చేతులారా చేసేదీ రాతమీద రుద్దేదీ! నేనసలు పెళ్లేచేసుకోను.

కాం: బాగుంది వరస. తొండముదిరి ఊసరవెల్లి అయిందట. పెళ్లికాని ఆడది అప్రతిష్ట పాలౌతుంది. ఇప్పటికే సగం చచ్చున్నాం.

శ: అమ్మాయి! నీవున్నది పల్లెలో. పుట్టింది హిందూసంఘంలో అన్నమాట మరిచిపోకు.

ప్ర: ఇప్పుడెంతోమంది పెళ్లిళ్లు మానేసి చదువుకుని ఉద్యోగాలు చేస్తున్నారు. వాళ్లందర్నీ సంఘం ఏంచేస్తున్నదీ.

కాం: ఉద్యోగాలుచేసి ఊళ్లేలే చదువు నీకెక్కడిదే. ఈ పల్లెలో ఉన్నపాటి చదువు చదివేటప్పటికే కళ్లు నెత్తిమీదకి వచ్చి పెద్దల నెదురిస్తున్నావు. ఇంకా చదువంట చదువు.

ప్ర: నాన్నా! నాకీ పాడుపెళ్లిచేసి బ్రతుకు మంట గలిపేకన్నా ఆడబ్బు నాకియ్యి పట్నంవెళ్లి చదువుకుంటా.

కాం: 20 ఏళ్లు నెత్తిమీదకి వచ్చాయి. ఇప్పుడు మొదలెడతావు చదువు. ఉన్న ఊళ్లో ఉద్యోగాలు వదులుకుని నిన్ను కాయడానికి పట్నం బైలుదేరాలికమేం. చచ్చే కాలానికి సారికావిళ్లట.

శ: ఊరుకోవే ఎందుకలా గొంతు చించుకుంటావు. అమ్మాయి! వ్యవహారం అప్పుడే చెయ్యి దాటిపోయింది. మొగపెళ్లివారు

# మూలిగే నక్కలు

కట్నండబ్బు అప్పుడే ముదరా పుచ్చుకున్నారు. కోమటి సుబ్బయ్యకి ఇల్లుఅమ్మకానికి అగ్రిమెంటు వ్రాసిచ్చి అడ్వాన్సు పుచ్చుకుని పెళ్లివారికిచ్చి ముహూర్తం వారంరోజుల్లో పెట్టించేశాను.

ప్ర: (ఏడుస్తూ) నాన్నా! నీవుకూడా నాగొంతు తడిగుడ్డతో తెగకోస్తావా?

శ: అమ్మాయీ! పెద్దమనుష్యుల్లోమాట. పరువు కాపాడు.

ప్ర: పరువట పరువు! నా సుఖంకన్నా నీకు పరువే ఎక్కువా?

శ: పరువు పోగొట్టుకున్న మానవుడు బ్రతికున్నా చచ్చినట్టే.

ప్ర: అంత పరువుమీద మమకారం ఉన్నవాడివి ముందే నన్నెందుకడగలేదు.

శ: ఇది నీమంచికే చేశాను.

ప్ర: ఏం మంచి గడమంచి.

కాం: నోరుముయ్యవే గయ్యాళిఘటమా! ఆనాడు మీ పెద్దక్కయ్య ఇలాగే పెద్దలమాట కాదందా. చేతకాకపోతే చూసయినా నేర్చుకో.

ప్ర: (రోషంతో) అందుకనే అనుభవిస్తోంది. నే చచ్చినా నాకిష్టంలేని పెళ్ళిచేసుకోను. మీ రెలా చేస్తారో చూస్తాను.

కాం: అయితే చావు. పీడా వదిలిపోతుంది. నీలాంటివాళ్ళు బ్రతికి మమ్మల్నేడిపించేకంటే చావడమే మంచిది. ఒక ఏడ్పేడ్చి ఊరుకుంటాం.

ప్ర: (ఏడుస్తూ) అవును హిందూ సంఘంలో ఆడదైపుట్టి బ్రతికి ఆనందించడానికి స్వాతంత్ర్యమేదీ. ఇష్టం లేని పెళ్ళిచేసుకుని అక్కలా కుమిలి కుమిలి చచ్చేకన్నా ఒక్కసారే చావడం మంచిది. ఆపనే చేస్తాలే మీ కళ్ళుచల్లగా. మీకు ఖర్చూ ఉండదు. (ఏడుస్తూ లోపలికి పోతుంది.)

శ: ప్రభా! ప్రభా! చూడు ఇది అసలే ప్రథమకోపి. ఆశ అడిగాయన్న ప్రథమోద్రేకంలో ఏం అఘాయిత్యం చేస్తుందో.

కాం: ఆ! దాని మొఖం. నాలుగు రోజుల్లో అదేదారికి వస్తుంది.

శ: అలా అనకు. ప్రభ తత్వం మనుష్యులు ముందాలోచన లేకుండానే ఏపనయినా చేస్తారు. నా మాటవిని వెళ్ళి దాన్ని సముదాయించు.

కాం: సముదాయిస్తే వినేరకమా అది.

శ: పోనీ పెళ్లి మానుకుందామంటే డబ్బుకు నీళ్లు వదులుకోవడమే కాకుండా ఇక జన్మలో దీని పెళ్లికూడా జరగదు. ఏ దారీ తోచడంలేదు. పాపం పెద్దది ఇంతకన్నా దౌర్భాగ్యపు సంమ్మంధం తెచ్చినా కిమ్మనలేదు. ఏం బాధలు పడుతోందో ఏమో. (ప్రవేశం, టెలిగ్రాం. బంట్రోతు. శరభయ్య టెలిగ్రాం తీసుకుని చదివి ఒక్కసారి కూలబడిపోతాడు.)

కాం: (కంగారుగా) అయ్యో! అయ్యో! ఏమండీ! అందులో ఏముందండీ! అలా అయిపోయారూ. బాబూ! నీవైనా చదివిచెప్పు బాబూ! అయ్యో!

టెలి: (చదివి) మీ—మీ—పెద్ద—మ్మా—

కాం: ఏమయింది నాయనా—ఏమయింది బాబూ. తొందరగా చెప్పు నాయనో.

టె: నూ—నూ—తిలో బడి చచ్చిపోయిందట.

కాం: అమ్మ నా తల్లో! ఏం పని చేశావే ఓయమ్మో! మీ నాన్న నెవరికి అప్పజెప్పావే ఓ తల్లో! ముదనష్టపు పెళ్లి చేశామే ఓ యమ్మో! నీ చావుకే వచ్చిందే ఓ తల్లో! అప్పుడే నూరేళ్లూ నిండాయా ఓ తల్లో!

[దొడ్లో గుభాలున చప్పుడు. తెరలో "ఓ కాంతమ్మగారో! అయ్యో! ఓ కాంతమ్మగారో! ప్రభావతి నూతిలో దూకిందండోయి! రండోయి]

కాం: ఓ నా బిడ్డో! ఓ నా తల్లో! రండ్రోయి! రండ్రోయి! నా బిడ్డని కాపాడండోయి! దేవుడో! ఎంతపని చేశావు దేవుడో! లేవండీ! లేవండీ! కొంపమునిగిందండీ. (గుండె బాదుకుంటూ పరుగెడుతుంది.)

శ: (అమాంతం శివమెత్తినవాడిలా లేచి పరిగెడుతూ) పద! మనం కూడా అందులోనే దూకుదాం. దరిద్రం వదిలిపోతుంది.



# కాలక్షేపం

గుబ్బం కదం త్రొక్కినట్లుగా, నాలుగు కోళ్ళపాటు వేస్తుంటే, బస్తీ అల్లుడికి ప్రాణం లేచివచ్చింది ఆ పాట వింటూ ఉంటే.

"బామ్మర్ల తానాలు-నే చెయ్యలేను.
తురకోరి లంగాలు - నేకట్టలేను
.........................
చేమంతి కడియాల - చెయ్యెత్తలేను
.........................
కాకార చెటూకు - కాయాలందమ్మ
మీ బావముక్కుకు - మీస మందమ్మ"

ఆ తెనుగు అసలైన దంపుడు కవిత్వం తెనుగు. ఆదంపుళ్ళకు వచ్చిన ఆడపడుచులకు ఉన్న రసపుష్టి బస్తీ భావకవుల కవిత్వంలో కన్పించదు. బస్తీ అల్లుడు యీ విషయం విమర్శించగలిగాడు. ఆ రాత్రి భోజనం చేసేటప్పుడు బావమరదితో మాట్లాడుతూ, "దంపుడు బియ్యపు అన్నం యింత కమ్మగా ఉంటుంది ఎందుచేత?" అని ప్రశ్నించాడు. ఆ మాటకు బావమరది యిలా సమాధానం చెప్పాడు. "ఉదయం ధాన్యం దంచిన ఆడవాళ్ళ సంగీత సాహిత్యం మధురంగా ఉన్నదని నీవే అన్నావు. ఆ మాధుర్యం అంతా యీ బియ్యంలో కలిసింది బావా!" అన్నాడు-ఆమాట నిజం. ఆముతక బట్ట, ఆ ముతకదంపుడు బియ్యం, ఆముతకదంపుడు పాటలాధరుల పాటల పటుత్వం, ఆకాయకష్టం, ఆకమ్మని పెరుగు, ఆముతక బ్రతుకు, వీనిలోనే ఉంది ముక్తి. గ్రామజీవితంలో ఉన్న కమ్మదనం ఎక్కడ ఉన్నదో తెలిస్తేనే గాని గ్రామజీవితం మీద అభిమానం సక్రమంగా ఏర్పడదు.

తమ భూములు బాగా పండినవని అమందానంద కందళిత హృదయారవిందులయ్యేడి ఆసాములు ఎందరో ఉన్నారు. ఒక పెద్దమనిషి తన తమ్ముని భూములకంటె తన భూములు ఎక్కువగా పంట పండినవని మరింత బ్రహ్మానందంతో ఉన్నాడు. ఆయన యింట్లో యీ యేడు కోతల దినాలలోనే కుమార్తె ప్రసవించింది. పండువంటి మొగబిడ్డ కలిగాడు. ఆ బిడ్డపుట్టినవేళా విశేషంగా ధాన్యం ధరలుకూడా అసామాన్యంగా హెచ్చి "ధర సింహాసనమై నభంబుగొడుగై" అన్నట్లుగా మిన్ను ముట్టుతున్నాయి. ఈ కారణం చేత ఈ ఆసామికీ, ఆయన భార్యకూ సంతోషం పట్టపగ్గములు లేకుండా ఉంది. సంక్రాంతి పండుగకు అల్లుడు యింటికి వచ్చిన కారణం చేత అల్లునికి చక్కని జరీ ఉత్తరీయం, జరీధోవతికలిసిన చాపు ఒకటి కొన్నాడు. అదే రకం జరీ అంచులుగల తెల్లని జరీచీర తన కుమార్తెకు పెట్టుటకై ఉద్దేశించికొన్నాడు. అల్లుణ్ని కూతుర్ని చంటిబిడ్డతో సహా ఒక్కసారిగా నట్టింట పీటలమీద కూర్చుండబెట్టి బొట్టుపెట్టి పట్టలేని సంతోషంతో బట్టలు పెట్టవలెనని ఆ యింటి యజమానియున్నూ ఆయన భార్యయున్నూ నిశ్చయించారు. అల్లుణ్ని కూతుర్ని ఒకరి ప్రక్క నింకొకరిని పీటల మీద కూర్చుండబెట్టి, తనపొలాల సంగతి, ధాన్యం రకాల సంగతి ప్రసంగిస్తూ ఆ యజమాని తన భార్యవైపు తిరిగి ఒక్క కేక వేశాడు. "ఏమేవ్! కత్తిగాని కత్తెర గాని ఉంటే యిట్లా తే. యీ జరీచాపు కత్తిరించి ఉత్తరించాలి" అన్నాడు. ఇంతలో ఆమె కత్తి ఒకటి తీసికొనివచ్చి, "అదేమిటి? అమ్మాయికి పెట్టవలసిన జరీచీర పట్టుకుని, దానిని కత్తిరించవలెనంటారు? ఇంకా నయం. పరాకుగా కత్తిరించలేదు ఇంకా" అన్నది ఆ మాటకు ఆ యజమాని "అవును నిజమే నే-నేను అలునితో పొలాల సంగతులు మాట్లాడుతూ, చీర ఏదో, ధోవతులచాపు ఏదో, సరిగ్గా గమనించలేదు" అన్నాడు. ఇంతలో ధోవతుల చాపు ఆమె తెచ్చి యిచ్చింది. ఆయన సరిగ్గా దాన్ని కత్తిరించాడు. ఇంతలో ఆయనభార్య ఒక గిన్నెతో తడి పసుపున్నూ, కొంచెం పారాణియున్నూ తీసికొని వచ్చింది. తన కూతురు ప్రసవించినంత సునాయాసంగా ప్రపంచంలో ఏ ఆడ కూతురూ ప్రసవించలేదని ప్రగల్భాలు చెప్పుకుంటూ వంటయింటిలోనుంచి హడావుడిగా హాలులోకి ప్రవేశించి, సరాసరిగా అల్లుడు కూర్చున్న పీటవద్దకు పరాకుగా వెళ్ళి, ఆయన కాళ్ళకు పసుపు పూయడానికి ఉపక్రమించి, "కాళ్ళు ముందరికి జాపుతే నాకు పూయడానికి వీలు" అంది. ఆ మాటకు యింటి యజమాని పక్కున నవ్వి, "నీ కేమైనా మతి పోయిందా ఏమిటి? అల్లుని కాళ్ళకు పసుపు పూస్తానంటావేమిటి?" అన్నాడు. యింటి యజమాని చేయబోయిన పొరబాటుకంటె, యింటి యజమానురాలు చేయబోయిన పొరబాటు ఎక్కువైనది కాదు. పెరుగు లేని బానలో రాధాదేవి కవ్వంతో చిలికినటువంటి కాలములోనూ ఎద్దుకు పాలు పితుకవలెనని శ్రీకృష్ణుడు దాని కాళ్ళకు బందం వేసిన కాలములోనూ, ధర్మధేనువు నాలుగుపాదాలతో నడిచింది. ఆనాటి రాధాకృష్ణు ` యీ జగత్తును తిరిగి పావనము చేయుదు ,గాక.



# పాఠకులకు మనవి

(2-వ పేజీ తరువాయి)

మా ఆశయం సఫలమై, మా యత్నం సార్థకమైనదని చెప్పుకోడానికి గర్విస్తున్నాము. మన పల్లె జీవనాన్ని కథావస్తువుగా స్వీకరించి హృదయరంజకమైన కథానికలను సృష్టించగలిగిన రచయితలు మన దేశంలో అనేక వందల మంది ఉన్నారంటే అది గర్వించవలసిన విషయం. కొత్తకొత్త కథకులనేకమంది ఉత్సాహంతో ముందంజవేశారు. ఇంత మంది రచయితల ఆదరాన్ని పొందగలిగినందుకు మే ముప్పొంగుతున్నాము.

మేము నిర్ణయించిన గడువు లోపల చేరిన కథలనే పోటీకి స్వీకరించవలసివచ్చినది. గడువు దాటివచ్చిన రచనలను స్వీకరించుట సాధ్యపడలేదు. అట్టి రచనలను పంపినవారు మా అశక్తతను గుర్తించి మన్నించవలసిందని కోరుతున్నాము. సహృదయులైన అనేక మంది కథకుల రచనలను స్థలాభావం వలన ఈ సంచికలో ప్రచురించలేకపోయినందుకు చింతిస్తున్నాము. అయితే ఆయా రచనలు మున్ముందు సంచికలలో క్రమేణా ప్రచురించబడగలవు.

కథారచనకు నూతనజీవాన్ని పోసి, సజీవమైన రచనాశిల్పాన్ని పునరుద్ధరించడానికీ, సంఘజీవనాన్ని కళ్లకు గట్టినట్లు చిత్రించడానికీ, తద్వారా చిన్నలూ పెద్దలూ, స్త్రీలూ పురుషులూ అను వివక్షత లేకుండా సర్వ వర్గాలవారిలోను పఠనాసక్తిని పెంపొందించడానికీ మా పత్రిక ద్వారా కృషి చేస్తున్న కథకులకు మా సంక్రాంతి అభినందనలు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St M

ఆంధ్ర ప్రేక్షకలోకానికి సంక్రాంతి కానుక




అంజలీ పిక్చర్స్ : మద్రాస్-**18.**

